శ్రీశివాయనమః

# వల్లీపరిణయము.

(స్కాందపురాణాంతర్గతము)

శ్రీమదాంధ్రలింగపురాణాద్యనేకగ్రంథకర్తయు
తెనాలితాలూకా హైస్కూలునం దాంధ్రోపాధ్యాయుడునగు
విద్వాన్, ములుగు చంద్రమౌళిశాస్త్రిచే వ్రాయబడి



యాబలూరు ఆదినారాయణశర్మగారి
ద్రవ్యసహాయమున

తెనాలి, లలిత ముద్రాక్షరశాలయందు ముద్రింపించి

నందికేశ్వరగ్రంథమండలివారిచే ప్రకటింపబడెను.

1932



(వెల 0-8-0



శ్రీ శివాయనమః

# శ్రీవల్లీపరిణయము.



## ప్రథమాశ్వాసము.



### ఇష్టదేవతా ప్రార్థనాదికము.

ఉ॥ శ్రీయననార్యనాఁ బ్రథితఁ • జెందిన శన్నియ పున్నియంపు ప
ట్టైయసమాన శక్తిని చ, రాచర లోకములేలు నాదినా
రాయణ శంకరాఖ్యల వి • రాజిలు బ్రహ్మము వేడ్క నాదినా
రాయణశర్మ శెల్లపుర • పార్థములన్ దయచేయుగావుతన్॥

సీ॥ ఏతల్లి శరజన్ము • మాతయై పెఁగించుఁ
బ్రథమాన నిజరూప • వైభవంబు
ఏయింతి పరమేశు • నిల్లాలగుటఁ దెల్పు
చారుశిరోధృత • చంద్రరేఖ

మేశాల రమణారి • తోఁబుట్టుగుటఁ జెల్వు
నిబిడేంద్రనీల న • న్నిభశరీర
మే కేమ కరుగాల • వాలయూ జెలిఁగించు
రక్షితాశేష ని • ర్జరచయంబు

అట్టి కాత్యాయనీదేవి • యనుదినంబు
శ్రితజనావన చతురయై • శ్రీలఁ జెలఁగు
నాదినారాయణాఖ్యుకు • నాదరమునఁ
గాంచుఁ గావుత సత్కృపా • కలితయగుచు.

ఉ॥ న్యాయపథంబు వీడి యన • యంబుఁ జరించెడి దుష్టసంతతిన్
కాయక సంహరించి బుధ • వర్గముఁ బ్రోచుచు సత్యమూర్తియై
తోయజ సంభవాండము న • దృష్ట మొనర్చెడి వెన్నుఁడాదినా
రాయణశర్మ కీవుత ని • రంతరసౌఖ్యము లెల్లవేళలన్॥

ఉ॥ కాయజుఁగన్నతల్లి త్రిజ • గంబులకున్ జనయిత్రి సర్వని
శ్రేయసపాళిపేటి సర • సీరుహవాసిని విష్ణుసౌఖ్య సం
ధాయిని భక్తకామ్యఫ • లదాయిని సాగరకన్య యాదినా
రాయణశర్మ యింట నన • యంబుఁ దొలంగక నిల్చుఁగావుతన్

చ॥ తన కులశాంతమోహముహి • ధామునిరీతిఁ దలంచి భీతిచేఁ
దన జనికిన్ నిదానమగు • తామర మీలన మందునంచుఁదా
వనితను మోములందిడి కృపామతి లోకములేలు వేల్పు పె
ద్దనుభజియింతు నెప్పుడు న • దంపడి మత్కృతికన్యఁ బ్రోవఁగన్

చ॥ కరములమోడ్చెదన్ గనక • గర్భుని రాణికిఁ జంచరీక బం
ధురమృదువేణికిన్ వికచ • తోయజపాణికి సర్వదేవతా
వర మకుటాగ్రరత్న ఘృణి • వారకరంబిత పాదపద్మ భా
సురయగు వాణికిన్ నిఖిల • సూరిజన స్తవనీయ వాణికిన్॥

చ॥ అనఘ యశోవిశాలులగు • నట్టి మహాకవు లెందఱో సనా
తనులు కృతుల్ బొనర్చి తమ • ధర్మువు నిల్పిరి వారినెల్లరన్

# ప్రథమాశ్వాసము.

వినుతి యొనర్ప శక్యమగు • నే నను బోలిన యల్పబుద్ధి క
ట్లనుచు నుపేక్షసేయక యొ•యంజలిచేసి నమస్కరించెదన్ ॥

చ॥ కొకిబికి చిట్టిపద్యములఁ ॥ గొన్ని రచింపఁగనేర్చి పండిత
ప్రకరముఁ బూరికిన్ గొనక ॥ ప్రాజ్ఞులుఁబోలె నటించుచున్ నిర
ర్గళబిరుదంబులన్ దమకుఁ ॥ దారెవహించి చరించుచుందురా
కుకవులు వారిజోలి మన ॥ కున్ దగదంచును మిన్నకుండెదన్.

వ॥ అని ఇష్టదేవతా వందనంబును మహాకవి ప్రశంసయుఁ గుకవి
యనాదరణంబును గావించి యేదే నొక్క భవ్యప్రబంధంబు
నవ్యప్రకారంబున వ్రాయఁదలంచి యున్నెడ.

ఉ॥ ఏయెడఁబల్కి బొంకుఁడొక • యింతయు నేనియొఱుంగనట్టివాఁ
డాయతబుద్ధిశాలి సుగు • ణాఢ్యుఁడు ధర్మపథానుగామి సు
శ్రీయుత యాబలూరి కుల • శేఖరుఁడై యలరారు నాదినా
రాయణశర్మయొక్క సమ • యంబున నెంతయుఁ గౌరవంబునన్

మ॥ ననునందీశ్వర పుత్రమధ్యముని నా • నాసూరిలోకైకజీ
వనకృల్లింగపురాణ కీర్తిత శివా • ప్రాణేశపాదాబ్జ భ
క్తినిధిన్ భైరవమూర్తి సద్గురుకృపా • దివ్యాత్మలాఢ్యున్ బవి
త్రుని విద్వద్విరుదాంచితున్ బిలిచి • సంతోషంబు విందైతగన్

సీ॥ ఏవంశమునఁ బుట్టె • నిద్ధయశోబ్ధిస
ర్వజ్ఞశేఖరుఁడు చా • పయమనీషి
యేకులంబున జని • యించె వియ్యనకవి
రసవత్ప్రబంధ ని • ర్మాణ కుశలి
యేగోత్రమున నుద • యించె సుబ్రహ్మణ్య
సూరీంద్రుఁ డధిగత • శ్రుతిచయుండు
ఏకాలంబునఁ గల్గె • మూకీకృతాఖిల
ప్రత్యర్థినందనా • రాధ్యగురుఁడు

అత్త్రీకులమున జన్మించి • యఖిలశాస్త్ర
ములు గడించిన భైరవ • మూర్తి గురున
కగ్రశిష్యుఁడవై సంస్కృ • తాంధ్రభాష
లందుఁ బ్రఖ్యాతిగాంచితి • వయ్యనీవు.

తే॥ మొదటినుండియు బ్రాహ్మకుల • మునజనించి
నట్టివారు మహాకవు • లగుటఁ జేసి
ముఱుగువారి యశోలత • ముజ్జగముల
నిండి యలరారుచుండు న • ఖండమగుచు.

ఉ॥ వ్యాసకృతంబు సర్వభవ • బంధ విమోచనమాద్య సత్కథా
భాసుర మార్గ సన్నుతము • వర్ణ్యము లింగపురాణ రాజముఁ
వ్రాసితి వాంధ్రభాష కవి • రాజులలోన నొకండవై గుణా
వాసము నీకవిత్వము సె • బాసనిపించునుగాదె చూడఁగన్.

తే॥ కీర్తినిఘటించు నర్థవి • స్ఫూర్తిఁజేయు
శుభముఁ గలిగించు వ్యవహార • సూక్తిఁదెలుపు
బరహృదయముల రంజించుఁ • బడఁతివోలెఁ
గౌతుకమ్ముఁగూర్చు నెపుడు • సత్కావ్యమరయ.

తే॥ సప్తసంతానములలోన • శాశ్వతమయి
కీర్తిఁగలిగించునది యొక • కృతియె కాన
తావకవిచిత్రకల్పనా • ధామమగుచు
నలరు సత్కృతి రచియింపు • మయ్యమాకు

వ॥ అని యహాసంభావనలఁ దనిపిన నొడనక వల్లేయని పురాణ రాజంబగు స్కాందంబునందలి శంకర సంహితాంతర్గతంబగు శివ రహస్య ఖండంబునఁ జెప్పంబడిన వల్లీపరిణయకథ చతుర్విధ పురషార్థప్రదంబగుటఁ జేసి యమ్మహాచరితంబు నాంధ్రీకరించి కృతిభర్తకు స్థిరంబగు యశోరత్నంబును స్వీయభాషామోహ కమూల్యంబగు నలంకారంబును సమర్పించి ధన్యుండగానెంచి యేతత్కృతిపతి వంశావతారం బెట్టిదనిన.

చ॥ అనఘతపః ప్రభావమున । నబ్జభవాదులనైన లెక్కసే
యని మొనకాండ్రు సంయమికులాగ్రణి న్యాయపదంబు గోత్రజీ
వనకరుఁ డాశ్రితప్రకర । పాలన దక్షుఁడు గౌతముండనాఁ
దనరు తపస్వి యొప్పుసుకృ । తంబుల మన్కియనర్ బ్రసిద్ధుఁడై

క॥ ఆవాచంయమికులమునఁ
బావనుఁడు వసంత యోగి । వర్యుఁడు నాఁవి
ద్యావాచస్పతి యుదయం
బై విశ్వవ్యాప్త కీర్తి । యై నుతిఁగాంచెన్.

క॥ అతఁడుతపోధనుఁడైయ
ప్రతిమాన సమస్త శాస్త్ర । పారగుఁడైసం
తత గౌరీశార్చావ్రత
రతుఁడై ద్విజముఖ్యుఁ డగుచు । రాణించెధరన్.

తే॥ ఆశ్రమ చతుష్టయమున స । న్యాసమొకఁడె
ముఖ్యమని తురీయాశ్రమం । బును వహించి
యతఁడు లోకగురుండయి । యఖిలయోగ
ముల ఘనికిమైతనర్చె బు । ధులు నుతింప

శా॥ ఆవంశంబునకెల్ల ముఖ్యుఁడయి వే । దాంతార్థ సంవేదియై
శ్రీవాణీకరుణారసాత్తసుకలా । శ్రేయోఽభిరాముండునై
గౌరీవాధీశ కుమారికాధిపతిప । దాబ్జీవ సేవాపరుం
డై వెల్గొందెను నాగభూషణుఁడు వి । ఖ్యాతిన్ విడంబించుచున్.

సీ॥ గౌతమ గోత్రవి । ఖ్యాతుఁ డానాగభూ
షణపండితునకుని । స్తంద్రకీర్తి
ధనులగు నల్వురు । తనయులు గల్గిరి
చంద్రశేఖర పూత । సంజ్ఞికుండు
సూదినారాయణా । ఖ్యాక బుధుండును
సంకప్ప యనుపేర । నలరు ఘనుఁడు

వేంకటరామాఖ్య విశ్రుతచరితుండు
నం దాదినారాయ ణాభిధానుఁ
డధిగతశ్రుతుఁడగుచు శి ష్యప్రశిష్య
సంచయముగల్గి సకలశా స్త్రప్రవీణుఁ
డై విమలకీర్తినిధియయ్యె నతని పేరు
వినిన కలుషహారంబని విజ్ఞులందురు.

క॥ పతిదేవత శేషమయును
నతిలోక గుణాఢ్యయగు మ హాలక్ష్మమయున్
సుతులుగ నాతఁడు నిరతము
పితృకులమలరించె వేద వేత్తలు వొగడన్.

తే॥ పితృపితామహులట్టుల విప్రవరుఁడు
వైశ్వదేవాది సత్క్రియల్ వఱలఁజేసి
పితృకులమునకు దేవతా ప్రతతికెల్ల
సంతసముఁ గూర్చె నిర్మల స్వాంతుఁడగుచు.

సీ॥ అతఁడు మహాలక్ష్మమాంబికయందు స
ద్దర్శనములువోలెఁ దనరు సుతుల
నార్వురనాది శేషాచలాఖ్యాకు శ్రీ
రామపండితు సుబ్బ రాయసుకవి
ననఘు లక్ష్మీకాంతుఁ డను ధీరు రామచం
ద్రాఖ్యాకు నిఖిలభ వార్తిహరుని
రమ్యచరిత్రు నా రాయణమూర్తియన్
బ్రథితుధర్మాచారరతు సమస్త
శాస్త్రనిధినిఁ లక్ష్మి నరసమయనంగ
వెలయు వారలఁగని నిజపితృఋణంబుఁ
దీర్చుకొనియె సాధ్వీలోక తిలకమైన
తనయ లక్ష్మినరసమ ధర్మనిధియగుచు.

తే॥ అమ్మిరాజుకులాబ్ధి శ•శాంకుఁడైన
వేంకటప్పాఖ్యునకుఁదాను • వెలఁదియగుచు
నలరె పతిదేవతామణి•యై యజస్ర
భర్తృసేవా నిరతలందుఁ • బ్రథమయగుచు.

వ॥ అందు లక్ష్మీకాంత బుధునకు సీతారామయ యను నాతఁడుద
యించె. మఱియు,

క॥ వారలలోనఁ గనిష్ఠుఁడు
నారాయణమూర్తి భూమి • నాయకకృత స
ద్గౌరవ పాత్రుండు గుణా
ధారుండై వెలసె నన్న•దమ్ములలోనన్.

ఉ॥ న్యాయపథంబువీడక స•నాతన ధర్మములోయకార్తులన్
బాయక ద్రోహచింతనము • భావమునందిడ కెట్టివారికే
నేయపకారమున్ సలుప•కెంతయు యోగ్యచరిత్రుఁడౌచు నా
రాయణమూర్తి నిర్మల య•శోంబుధియై యలరారె ధారుణిన్.

క॥ అతఁడధ్యయన పరుండున్
శ్రుతిహిత ధర్మానుగామి • సుశ్లోకుం డం.
చితకీర్తిశాలియై య
ప్రతిహత తేజుఁడయి గోత్ర • వర్ధనుఁడయ్యెన్.

క॥ తనకుఁ జిలుమూరు సతతము
మనికిగ వసియించి విప్ర • మండనుఁడగుచున్
ఘనుఁడాతఁడు శ్రితలోకా
వనుఁడై ప్రథఁగాంచిమించె • బాంధవతతిలోన్

చ॥ హరికులసంభవుండగుచు • నప్పయనానుతిగాంచి సద్యశ
స్స్ఫురణవహించి మించుబుధ • పుంగవుకూతును కృష్ణవేణినాఁ
బరగు సతీలలామ చెయిఁ • బట్టి కరంబలరారె సౌఖ్యసా
గరమున నోలలాడుచు న • ఖండ మహావిభవుం డంతఁడోగిన్.

ఉ॥ ఇమ్మహి యాబలూరికుల ♦ మెల్లను ధన్యముగాఁగ ధర్మమా
ర్గమ్మున సంచరించుచు ని ♦ గర్వవతీమణియై సమస్తతీ
ర్థమ్ములఁ గ్రుంకు క్షేత్రములఁ ♦ దద్దయు మెట్టుచునుండుఁ గృష్ణవే
ణమ్మ సతీమతల్లియయి ♦ యార్యజనస్తుతి పాత్రమైతగన్.

తే॥ అమల కృష్ణాస్రవంతీ స ♦ మాగమమున
సంతసిలెడు రత్నాకరు ♦ చందమునను
కృష్ణవేణి మహాసాధ్వి ♦ కేలుబట్టి
ముదముఁగాంచె నారాయణ ♦ మూర్తి మదిని,

చ॥ తనశివభక్తి తత్పరతఁ ♦ దద్దయునెల్ల రెఱుంగు నట్టులన్
మ్మనుకొని యాఘనుండు చిలు ♦ మూరుపురంబున రామలింగదే
వునకొక యాలయంబును క ♦ వుల్ వినుతింపఁగ నేర్పరించె నెం
డునతనితోడ సాటియగు ♦ ధూర్జటిభక్తులు లేరు లేరనన్.

తే॥ ఏకపత్నీవ్రతుండయి ♦ యెసఁగు నాతఁ
డబ్జయోని ముఖచతుష్ట ♦ యంబుఁబోలె
నలరు పుత్రుల నల్వుర ♦ నాత్మజలను
ముగురఁగనె మూఁడుశక్తులఁ ♦ బోలువారి.

వ॥ వారును క్రమంబుగ వేంకటసుబ్బారావు ఆదినారాయణశర్మ వేంకటరామయ్య యప్పారావన నలదిరి. మాణిక్యము సౌభాగ్యము పార్వతమ్మ నాఁగూతులొప్పి రందప్పారావును సౌభాగ్యమయును బాల్యంబునన యైహిక సంబంధంబువీడి పరలోకంబున కేగిరి. తక్కిన వారిలో మాణిక్యము గాదిరాజు లక్ష్మీనారాయణ గారికిని పార్వతమ్మ యోగిరాల నారాయణమూర్తి గారికిని బత్నులైరి. తక్కిన మువ్వురు పుత్రులలో

ఉ॥ వేంకటసుబ్బారావు శ్రిత ♦ విద్వదభీష్టకరుండు నీతివి
ద్యాంకుఁడు దైవభక్తిపరుఁ ♦ డంచితకీర్తి గుణప్రపూర్ణుఁడున్
బొంకు నెఱుంగఁడింతయును ♦ పూతచరిత్రుఁడు ధీవిశాలుఁడా
తంక వివర్జితుండగుచు ♦ ధారుణిఁ జెన్నలరారు నెంతయున్.

తే॥ అతఁడు రాజమ్మ యనియెడు సతివరించి
యధిక సౌఖ్యాబ్ధి వీచిక లందుఁ దేలి
యతిథివర్గంబు సంతృప్తి నందునటుల
సంచరించుచు నుండు య ◆ శంబుఁ గోరి.

తే॥ మధ్యమ ద్రవ్యమునఁ గోర్కె l మందముగను
నుత్తమ ద్రవ్య మార్జించి ◆ యుచితరీతి
సాటివారలలోఁ l గడు మేటి యగుచు
సుబ్బరావు చరించును l శ్లోకుఁ డగుచు.

వ॥ మఱియు నాతండు

క॥ పితృదేవత లెల్లరు స
ద్గతిఁ గాంచెను నల్లతండు l కనియెను సత్సం
తతి రాజమయందున నొక
సుత నిరువుర సుతుల వంశ ◆ శోభనకరులన్.

వ॥ వారును గ్రమంబున బాలాత్రిపురసుందరియు నారాయణమూర్తియు సీతారామమూర్తియు నాఁబడిరి అందు త్రిపురసుందరిని గుండిమెడ సీతారామయ్య యను నాతని కిడి కన్యాదానంబుఁ గావించె నింక వేంకటరామయ్య.

క॥ ఆతఁడు గూర్మి దలిర్పన్
సీతారామమ్మ యనెడు ◆ చెలిఁ బరిణయమై
ఖ్యాతి వహించెను గులమునఁ
బ్రీతిన్ గూర్చుచును ◆ చిన్నపెద్దల కెల్లన్.

క॥ పరసతుల మాతృభావముఁ
బరగించును గురువులందు l భక్తిప్రసంగన్
నిరతము వేంకటరామయ
స్థిరచిత్తుండై చెలంగు ◆ సిరుల కునికియై.

క॥ మాతృపదార్చారతుఁడై
భ్రాతల యనుమతిఁ ◆ జరించు ◆ బండితు లనినన్

చేతమునఁ భక్తిఁ జూపున్
బూతచరిత్రుం డగుచుం • బుధజన హితుఁడై.

వ॥ అతనికి రాజరాజేశ్వరియు గామేశ్వరియు నానిరువురు కూతులుద యించిరి. మఱియు

సీ॥ మగని పౌరుషమును • సగము సేయఁ దలంప
దార్క్ష్యనా సమ్మతి • నందుఁ గాని
చపలమై యందందు • సంచరించి మెఱుంగ
దిందిరపా సుతిఁ • జెందుగాని
పలువురి నోళ్ళలోఁ • బడి కృశింపదు సుంత
పలుకువెలఁది నాఁగ • నలరుఁ గాని
బహుమార్గములఁ ద్రొక్కి • భ్రాంతిఁ జెందదు సుర
గంగనాఁ బూతయై • క్రాలుఁ గాని
స్వాంతమున భర్తృసేవయె • సలుపుఁ గాని
కలనయిదఁ బతి కెదురయి • పలికి మెఱుంగ
దంగనాలోక సమ్మాన్య • యైన గాది
రాజు మాణిక్యమాంబ ని • రంతరంబు.

వ॥ ఆసాధ్వి గాదిరాజు లక్ష్మీనారాయణగారికిల్లాలై పురుషోత్తమశర్మ సీతారామయ్య హేమసుందరరావు పూర్ణచంద్రరావు నాఁబడు పుత్రులను సీతారామమ్మ యను కూతురును గని మున్నంగి సీతారామయ్య యనువానికిఁ గూతు నొసఁగె మఱియు ఓగిరాలనారాయణమూర్తిగారిభార్య పార్వతమ్మ.

క॥ తనధర్మువు విడనాడక
యనఘులను తృణంబు సేయ • కాశ్రితులందున్.
గనికరము బూని శ్రీమ్మరు
ననయం బాపార్వతమ్మ • యకుటితబుద్ధిన్.

వ॥ ఆమెకు శ్రీ వేంకటనరసింహారావును రామచంద్రరావునన నిరువురు సుతు లుదయించిరి.

బి]

తే॥ అతఁడు రాజమ్మ యనియెడు సతివరించి
యధిక సౌఖ్యాబ్ధి వీచిక లందుఁ దేలి
యుతిథివర్గంబు సంతృప్తి నందునటుల
సంచరించుచు నుండు య ౹ శంబుఁ గోరి.

తే॥ మధ్యమ ద్రవ్యమునఁ గోర్కె ౹ మందముగను
నుత్తమ ద్రవ్య మార్జించి ౹ యుచితరీతి
సాటివారలలోఁ ౹ గడు మేటి యగుచు
సుబ్బరావు చరించుచు ౹ శ్లోకుఁ డగుచు.

వ॥ మఱియు నాతండు

క॥ పితృదేవత లెల్లరు స
ద్గతిఁ గాంచెడు నట్లతండు ౹ కనియెను సత్సం
తతి రాజమయందున నొక
సుత నిరువుర సుతుల వంశ ౹ శోభనకరులన్.

వ॥ వారను గ్రమంబున బాలాత్రిపురసుందరియు నారాయణమూర్తియు సీతారామమూర్తియు నాఁబడిరి అందు త్రిపురసుందరిని గుండిమెడ సీతారామయ్య యను నాతని కిడి కన్యాదానంబుఁ గావించె నింక వేంకటరామయ్య.

క॥ ఆతఁడు గూర్మి దలిర్పన్
సీతారామమ్మ యనెడు ౹ చెలిఁ బరిణయమై
ఖ్యాతి వహించెను గులమునఁ
బ్రీతిన్ గూర్చుచును ౹ చిన్న పెద్దల నెల్లన్

క॥ పరసతుల మాతృభావముఁ
బరగించును గురువులందు ౹ భక్తిప్రసంగన్
నిరతము వేంకటరామయ
స్థిరచిత్తుం డై చెలంగు ౹ సిరుల నెనికి యై.

క॥ మాతృపదార్చా రతుఁడై
భ్రాతల యనుమతిఁ ౹ జరించు ౹ బండితు లనిన్

శేరమునఁ భక్తిఁ జూపుఁ
బూతచరిత్రుం డగుచును । బుధజన హితుఁడై.

వ॥ అతనికి రాజరాజేశ్వరియు గామేశ్వరియు నా నిరువురు కూతులుద
యించిరి. మఱియు

సీ॥ మగని పౌరుషమును । సగము జేయఁ దలంప
దార్ఢ్యనా సన్నుతి । నందుఁ గాని
చపలమై యందందు । సంచరించి మెఱుంగ
డిందిరపొ నుతిఁ । జెందుగాని
పలువురి నోళ్ళలోఁ । బడి కృశింపదు సుంత
పలుకు వెలఁది నాఁగ । నలరుఁ గాని
బహు మార్గణములఁ ద్రొక్కు । భ్రాంతిఁ జెందదు సుర
గంగనాఁ బూతయై । క్రాలుఁ గాని
స్వాంతమున భర్తృసేవయె । సలుపుఁ గాని
కలనయిదఁ బతి కెదురయి । పలికి యెఱుఁగ
దంగనాలోక సమ్మాన్య । యైన గాది
రాజు మాణిక్యమాంబ ని । రంతరంబు.

వ॥ ఆసాధ్వి గాదిరాజు లక్ష్మీనారాయణగారికిల్లాలై పురుషోత్తమశర్మ
సీతారామయ్య హేమసుందరరావు పూర్ణచంద్రరావు నాఁబడు
పుత్రులను సీతారామమ్మ యను కూతురును గని మున్నంగి
సీతారామయ్య యనువాతనికిఁ గూతు నొసఁగె మఱియు ఓగిరా
లనారాయణమూర్తిగారి భార్య పార్వతమ్మ.

క॥ తనధర్మువు విడనాడక
యనఘులను తృణంబు సేయ । కాశ్రితులందుఁ.
గనికరము బూని శ్రీమ్మరు
ననయం బా పార్వతమ్మ । యకుటిలబుద్ధిఁ.

వ॥ ఆమెకు శ్రీ వేంకటనరసింహారావును రామచంద్రరావునన నిరువురు
సుతు లుదయించిరి.

తే॥ సంతతము భ్రాతృసేవా ని ♦ శాంతుఁ డగుచు
వలరు వేంకటరామయ ♦ యనుదినంబు
సాధుసంగంబె తనకు య ♦ శంబుఁ గూర్ప
వినయ ధౌరేయుఁడై యాంగ్ల ♦ విద్య నేర్చెఁ.

సీ॥ తనప్రవర్తనము బాం ♦ ధవలోకమున కె కా
కెల్లవారికి ముదం ♦ బే యొనర్పఁ
దన నిర్మలాఖ్య వి ♦ ద్వత్సంతతి కె కాక
నాస్తికులకును మం ♦ త్రమయి వెలయఁ
దన యీవి యర్థి సం ♦ తానంబున కె కాక
ధనవంతులకును ము ♦ దంబుఁ గూర్పఁ
దన పల్కు పల్కుల ♦ ననుజీవులే కాక
యధికారులును శిర ♦ సావహింప

నాడితప్పని నిత్య స ♦ త్యవ్రతుండు
పరుల కుపకారమే సల్పు ♦ పండితుండు
ఆదినారాయణాఖ్యార్యుఁ ♦ డనఘచరితుఁ
డెసఁగు గౌతమ గోత్రమ ♦ హీనముగను.

క॥ శ్రీవిద్యోపాసకుఁడై
దేవీనవరాత్రవిపుల ♦ దీక్షాన్వితుఁడై
పావకసమతేజుండై
శ్రీ వెలయ నతండు వినుతిఁ ♦ జెందెఁ గులమునన్.

క॥ తనవారు వీరు పెరవా
రను భేదము లేక యెల్ల ♦ యందును సముఁడై
యనయము నిష్కల్మషబు
ద్ధిని ద్రిమ్మరు నతఁడు భూమి ♦ దేవప్రియుఁడై.

సీ॥ సుంతేని పెరవారి ♦ సొమ్ము గోరఁ దలంపఁ
డేరీతిగ గడించె ♦ నింత ధనముఁ

గలనైనఁ దన పొగ ♦ డ్తల విని సైపలేఁ
డేమాడ్కి వ్రాయించె ♦ నిట్టి కృతులఁ
బల్లెత్తి యన్యులఁ ♦ బలుకనేరని వాఁడు
ప్రతివాదితతి నెల్ల ♦ భంగపరచె
క్షణమైన విశ్రాంతిఁ ♦ గనియెఱుంగని యాతఁ
డెవ్విధిఁ గాంచెన ♦ హీన సుఖము
సంతతాతిథిలోకపూ ♦ జాపరుండు
యాబలూరి కులాబ్ధిశ ♦ శాంకుఁడైన
యాదినారాయణాఖ్యకుఁ ♦ డనుచు బుధులు
వినుతిసేయఁగ నలరెన ♦ విప్రవరుఁడు.

తే॥ తనకు గుండిమెడకులీనుఁ ♦ డనఘుఁడైన
రామకోటయపుత్రి శా ♦ రదశశాంక
వదనయగు శారదాంబనా ♦ వనరుహాక్షి
యతివగా నాదినారాయ ♦ ణాఖ్యుఁ డలరు.

తే॥ సకల సుగుణాలవాలయా ♦ శారదాంబఁ
గలిసి వివిధ సుఖంబులఁ ♦ గాంచె నతఁడు
అమృతవల్లీకరగ్రహ ♦ ణము నొనర్చి
సంతసించెడి శరజన్ము ♦ చందమునను.

క॥ ఆజంపతీరచిత స
త్పూజాఫలమోయనంగఁ ♦ బుత్రీరూప
భ్రాజదమలేందుకళయన
గా జననంబయ్యె ముక్తి ♦ కాంతతనయయై.

క॥ గౌరీపదపద్మసమ
ర్చారతయగు శారదాంబ ♦ స్వర్గపురంధ్రీ
వారమునకుఁ బతిసేవా
చారముఁ దెలుపననరిగె ♦ స్వర్లోకంబున్.

క॥ అనుకూలసతిన్ బెడబా
సిన చింతయుఁ బిత్రుఋణంబు • సెల్లుటయెట్లో
యనువంతయుఁ హేతువులుగ
ననఘుఁ డతఁడు కొంతకాల • మరిగినపిదపన్.

వ॥ మున్నంగి చినసుబ్బరాజునా నొప్పు సంపన్నగృహస్థు కూతు వజ్రమయను సతిన్ బరిణయంబయ్యె.

క॥ తన కేకారణమున నై
నను విసుగు జనించెనేని • నళినదళాక్షీ
జనమణియగు వజ్రమమె
ల్లన లాలనజేసి యది తో • లంగించు వెసన్

చ॥ గురువులయందు భక్తియును • గోవిదులందును గౌరవంబు నా
దరము శ్రితప్రకాండమున • దాసులపైఁ గరుణార్ద్రదృష్టియున్
బరపుచు వజ్రమాంబపతి • భక్తికిఁ బెట్టని కోటయై నిరం
తరము చెలంగు బంధుజన • తాకృత గౌరవపాత్రమైయిలన్.

తే॥ ఎంత సిరిగల్గినను మది • నుంతయేని
గర్వపడ కడగి మడగి • కలిసి మెలసి
బంధువులలోనఁ దగునను • ప్రథితఁగాంచె
వజ్రమ కపటపర్వత • వజ్రమగుచు.

సీ॥ పతిమాట కింతయు • బదులాడియెఱుఁగదు
తలవాంచి సమ్మతిఁ • దెలుపుఁగాని
యాఁకొన్నవారిపై • నాగ్రహించియెఱుంగ
దహోన్నమిడి వారి • ననుచుఁగాని
తప్పుచేసినఁగాని • దండించియెఱుఁగదు
మంచిత్రోవన వారి • నుంచుఁగాని
పొరుగిండ్లఁబెత్తనం • బు లొనర్చి యెఱుఁగదు
తన యోగ్యకృత్యముల్ • దాల్చుఁగాని

గురుజనంబునకుఁ గిన్కఁ • గూర్చియెఱుఁగ
దాశ్రయించి వారల కృప • నందుఁగాని
చారుశీలసంతత సదా • చారలోల
వరగుణకదంబ యా • వజ్రమాంబ.

క॥ పతి శుశ్రూషారతయై
యతిథుల నాదరము సేయు • నంచితభక్తిన్
క్షితిధరకన్యాపూజా
వ్రతముం బొనరించు బంధు • వర్గము వొగడన్.

ఉ॥ శ్రీయన వైభవాఢ్యయయి • చెన్నలరారెడు వజ్రమాంబయం
దాయతకీర్తిశాలి సుగు • ణాన్వితుఁడై ప్రథగన్నయాదినా
రాయణశర్మ గాంచెఁ దన • యా ద్వితయంబును శారదాంబనా
హేయ పదార్థహీనఁ బర • మేశ్వరినాఁబడు వారివేడ్కతోన్.

తే॥ గుండిమెడ వేంకటేశ్వరా • ఖ్యునకు ముక్తి
కాంత నిడి పెండ్లిచేసె నా • ఘనుఁడు మఱియు
వరలు మున్నంగి వేంకటే • శ్వరున కిడియె
శారదాంబను విధ్యుక్త • సరణి వెలయ.

తే॥ జనని పరమదైవ • మను ప్రత్యయంబున
నధికభక్తితోడ • నహరహంబు
మాతృసేవఁ జేయు • మన్నించు నాదినా
రాయణాఖ్యుఁడాశ్రి • తాళి నెపుడు.

తే॥ పావనక్షేత్రరాజము • వారణాసి
మున్నుగాఁ గలవాని నె • న్నెన్నొ కనియెఁ
బితృపితామహాదులకు స • ద్గతులు గలుగ
గయను బిండ దాన మొనర్చెఁ • గరము భక్తి.

క॥ గంగాది నిఖిలతీర్థము
లం గ్రుంకె నతండు నిర్మ • లస్వాంతుఁడు వే

డఖ్యం గోదానములను స
ల్పెం గాశీపురమునందు • విజ్ఞులు మెచ్చన్.

క॥ ప్రతి శుక్రవారముల నం
చితభక్తిన్ దేవిపూజ • సేయుచు నిల్లా
లతిభక్తిం గొలువ నాతం
డతిథియె దైవంబటంచు • నాత్మం దలంచున్.

షష్ఠ్యంతములు.

క॥ ఏవంవిధసుగుణఖనికి
భావభవారాతి పాద • పంకేరుహసే
వావిర్భవదఖిలైశ్వ
ర్యావళికిన్ విను తవజ • మాంబా పతికిన్.

క॥ నారాయణమూర్తికృత
స్ఫారతపః పుత్రరూప • పరిపాలునకున్
సూరిజనగేయునకు గం
భీరస్వాంతునకు నయవి • వేకాంబుధికిన్.

క॥ నిరతశివారాధన త
త్పరునకు మలయనగ తుహిన • ధాత్రీధరమ
ధ్యరసాపరివృతకీర్తి
శ్వరునకు గౌతమసగోత్ర • సంభూతునకున్.

క॥ విద్వత్కవీంద్ర మిత్రున
కద్వైతమతానుయాయి • కతిథిసమర్చా
సద్వర్తనునకు శ్రీవి
ద్యాద్విగుణిత వైభవునకు • ననఘాత్మునకున్.

క॥ శ్రుతిహితధర్మాచరణ
వ్రతునకు స్మార్తక్రియాని • రతునకుం బిత్రుస
ద్గతికారకునకు మామక
కృతిపతికి జగత్ప్రతీత • కీర్తిశునకున్.

వ॥ అభ్యుదయపరంపరాభివృద్ధిగా నా యొనర్పంబూనిన వల్లీపరిణ

యంబను ప్రబంధంబునకుఁ గథాప్రారంభమెట్టిదనిన.

ఉ॥ శాంతము మౌనిపుంగవని • శాంతము పావనయజ్ఞవాటికా
కాంతము బ్రహ్మచారికుల • కల్పితరాజదనేకవల్లికా
క్రాంతము శీతవాతచయ • కంపితపుష్పపరాగసంచయా
క్రాంతము నైమిశాఖ్యవన • రాజము లోచన కాంతమౌనిలన్.

సీ॥ అలసిన లేడికి • ల్లలకు దర్భాంకురం
బుల నొసంగెడి మౌని • పుత్రికలును,
ఆకొనివచ్చిన • యావేశికులకు నా
తిథ్యమొసఁగు పతి • దేవతలును,
శ్రోత్రవిద్యార్థులఁ • గూర్చి తొల్లింటి పాఠ
ముల సంతజెప్పెడి • మునికులంబు
అలరుఁ దీవెలకుఁ బా • దులు సేసి మెల్లన
నీరు వోసెడి శిష్య • నికరములును,
నిత్యనైమిత్తిక క్రియా • నిరతదీక్షి
తారచితబహుయజన సం • భారములును
గలిగి సకల సుకృతముల • నెలవునగుచు
నలరు సంతతమా నైమి • శాఖ్యవనము.

సీ॥ ఒకచోటఁ బిపాసుసిం • హకదంబములకుఁగ
రముల నీరిడెడి వా • రణచయంబు
ఒకవంకఁ ద్రోకలై • త్రిప్పొని వాహ్యాళిగఁ
బసుల వెంబడి బాఱు • వ్యాఘ్రములును
ఒకమూల మార్జాల • నికరంబు మూతి మీఁ
సలఁబట్టి లాగు చుం • చులకొలంబు
ఒకపజ్జ ముంగిస • లకుఁ బ్రియావహారముల్
పంచియిచ్చెడి త్రాచు • పాముగమియు
నొకయెడను శుకపోతంబు • లకు రసాల
ఫలములందిచ్చు శ్యేనాంగ • నలును గలిగి

మునిజనతపోహాదేశమై ♦ యనఘమగుచు
నమ్మహాటవిపావనం ♦ బై రహించు.

అనఘులు మౌనులందహర ♦ హం బొనరించెడి నగ్నిహోత్రధూ
మనికర మాకసంబును గ్ర ♦ మంబునఁగప్పి శశాంకసూర్యులన్
గనఁబడకుండఁజేయఁగన ♦ కాలమె మేఘములెట్లుగల్గెనం
చనుకొనుచుందు రవ్వనము ♦ నందలి ముగ్ధమునీంద్ర కామినుల్.

తే॥ సుకృతముల కాస్పదంబయి ♦ చూడఁగఁదగు
నవ్వనంబున మునులెల్ల ♦ నార్జితమగు
తపము నాఱవభాగంబు ♦ ధరణిపులకుఁ
బంచియిత్తురు తమ్ముఁగా ♦ పాడుదురని.

మఱియు నమ్మునిచంద్రులు.

క॥ పరిపక్వరసాలఫల
స్ఫురణఁదనివిఁగూర్పనట్టి ♦ పురవైరిమనో
హరచరితము లెన్నినియుఁ
గరము వినియువినెడుకోర్కె ♦ గడలుకొనంగన్.

తే॥ అఖిల శాస్త్రపురాణేతి ♦ హాసములకు
నిలుచుతావు, శ్రుతీరిత ♦ నిఖిల ధర్మ
చయము వ్యాసప్రదేశంబు ♦ సరసవచన
నిపుణురామహర్షణిని ధ్యా ♦ నించుటయును,

చదివినవాఁడు వింతలకు ♦ సర్వముమెల్లనఁ బూసఁగ్రుచ్చిన
ట్లదనదగాకచెప్పఁగల ♦ యట్టిసమర్థుఁడు వ్యాససత్కృపా
స్పదము పురాణసంచయము ♦ పట్టుశమాదిగుణాన్వితుండు వీ
తదురితుఁడిద్ధతేజుఁడు కృ ♦ తజ్ఞుఁడు సూతుఁడువచ్చె వచ్చినన్.

క॥ కనుఁగొని తద్దర్శన సం
జనితవినయసంభ్రమములై ♦ సంగఁగనహా

సనమిడికుశలప్రశ్నం
బొనరించిన మెచ్చి సూతుఁ ♦ డుద్యన్ముఖుఁడై.

ఉ॥ వారలఁగాంచి పల్కెముని ♦ వర్యులు మీకుశుభంబె
చేరువనాశ్రమంబులకుఁ ♦ జెందునె సౌఖ్యము లిప్పుడ
దారులువచ్చి స్వీయమగు ♦ ధర్మవ్రతకర్మ సంచరింత
క్రూరులు రక్కసుల్ యజన ♦ కోటికి విఘ్నమొనర్ప

ఉ॥ శాంతులు మీరు మీయెడల ♦ శర్వునకున్ గృపగల్గు
శ్రాంతము నేఁడుఁ దలఁతయును ♦ తాదయినన్ హితలోక
స్వాంతము మిమ్ముఁగూర్చిన వి ♦ చారమొసల్పుచునుండ
మ్మింతగఁబ్రశ్నసేయుదు సహింపుఁడు సావధియించు

తే॥ వ్యాసమునివర్యుఁ డఖిలవే ♦ దార్థవేత్త
విశ్వనాథుని దర్శింప ♦ వెడలెఁ గాశి
కమ్మహాత్మునివెనువెంట ♦ నరుగుకతన
నింతతడవయ్యె మీకడ ♦ కేగుదెంచ.

ఉ॥ అంగజవైరి సత్కథల ♦ కాలయమైయలరారు దానిమ
త్కింగయిసేయ నేరిచిన ♦ దిట్టనఘౌఘ వినాశకంబు (
లింగపురాణమున్ విసుగు ♦ లేకయె వింటిరి మీరు ద
యం గృతకృత్యమయ్యెను గ ♦ దా వటరాజము మీ

తే॥ వీను వచియించు సత్కథ ♦ లెల్లవినుటఁ
జేసి పూతమై సుకృతంబుఁ ♦ జెందుకతన
నేమొ శివశివాయనుచును ♦ మృదులరీతిఁ
బలుకుచున్నది కనుఁడదె ♦ చిలుక యచట.

క॥ పావన మీ యాశ్రమము శు
భావాసము త్రిణయనుని క ♦ థావళియరయన్
శ్రావకులు మీరు ప్రాజ్ఞుల
రీవిధి వేరొకటఁగలుగు ♦ నే నా కెపుడున్.

ఉ॥ కాంచితి మానులన్ గనక ♦ గర్భసమానుల ముక్తి
సంచిత పూర్వపుణ్యఫల ♦ సంచయరూపుల యోగివ

ప్రాంచదనూనతేజులను • భావము మీయెడ నిల్పి[illegible]లో
కీర్తించుకయేని నిల్వదు సు • డీ తలపంగఁ బరస్థలంబులన్.

ఉ॥ క్షేత్రములందుఁగాశియె వి • శిష్టగుణంబగునట్టి కాశికా
క్షేత్రము మెట్టియున్ మనసు • చింతనె చెందు మదుక్తసత్కథా
పాత్రములైన మిమ్ముఁ బెడ • బాయుటఁ జేసి యకారణంబ యీ
మైత్రి చెలంగె మీయెడ న• మానసతర్క్యములీశకృత్యముల్.

తే॥ అనుదదరహాసితాస్యులై • యాశ్రమీయు
లోకరముఖాంబుజంబు మ • ఖోకరు గనుచు
మనసులో నేదియో యను • కొనుచు నతనిఁ
గాంచి వచియించి రిట్టులఁ • గౌతుకమున.

ఉ॥ నిక్కువమే వచించితివి • నీయెడ మాకును నీకు మాయెడన్
జిక్కిన కూర్మియే యిటులఁ • జెప్పఁగఁ జేసెనునయ్య సంతతం
బొక్కెడ నిల్వఁ బోలునె ప • రోపకృతిం బొనరించువారికిన్
మక్కువయెల్లయ దును స • మానమెయౌఁగదత్వాదృశాళికిన్.

తే॥ అమృతకణము లట్లు • యాప్యాయనకరంబు
లైన తావకోక్తు • లహరహంబు
కారణాంతరమునఁ • గలుగు మనస్తాప
మును హరించి మోద • మును ఘటించు.

చ॥ ఘనుఁడు పరాశరాత్మజుఁ డ • ఖండ తపోనిధి లోకరక్షకై
యనఘములౌ పురాణనిచ • యంబులనెల్లను సంగ్రహించి చె
ప్పినయవి తేటతెల్లముగఁ • బ్రీతిమెయిన్ వినిపించినావు నీ
కెనయగు నాప్తపర్యుఁడొకఁ • డెందు లభించును మానిపుంగవా.

చ॥ కలుషవినాశకంబయిన • స్కాందపురాణముఁ బ్రీతిఁ జెప్పుచో
సలలితబుద్ధి నొక్కెడఁ బ్ర • సంగవశంబునఁ గార్తికేయుఁ డు
జ్జ్వలతను రూపకాంతిగుణ • సంపదమించి వెలుంగువల్లియన్
జెలిని బరిగ్రహించెనని • చెప్పితి వా కథ యెట్లొ చెప్పుమా ?

క॥ అవతంసంబులు శ్రుతులకుఁ
గవిలోకమనోహరములు • కామ్యప్రదముల్

భవబంధవిమోచనములు
శివగుణగణభావణములు ♦ శ్రేయస్కరముల్.

క॥ నాయకుఁడు దేవసేనా
నాయకుఁడట వ్యాధకాంత ♦ నాయికయటస్వ
శ్రేయసముఁ గూర్చుఁజరితం
బేయెడ లభియింపనేర్చు ♦ నేమనకిటులన్.

వ॥ నిరంతర పరమేశ్వర ధ్యానాసక్తచిత్తులగు భవాదృశులకు సంసారార్ణవమగ్న మాదృశ పామరకోటి నుద్ధరించుట స్వభావజంబగుటయు, బ్రాజ్ఞలోకసందర్శనావసరంబునన కాక వేరొండుతటి జిజ్ఞాసుజనేప్సితసిద్ధి గలుగకుంటయుఁ గారణంబులుగఁ బూర్వోత్తప్రశ్నావకాశంబు గలిగె ననవుఁడు సూతుండు నిమీలితలోచనుండై యించుకసేపు హృదయంబు జలింపనీయక.

క॥ కలుషహారంబులు శ్రేయో
నిలయంబులు ముక్తికామి ♦ నీమందిర ని
ర్మల సోపానంబులు గురు
లలిత పదంబుల మదిఁ గద ♦ లంతుఁ భక్తిన్.

తే॥ ఎవని సంకల్పమాత్రాన ♦ నీజగంబు
లెల్ల జనియించు నేవ్వాఁడ ♦ హీనశక్తి
వృద్ధిఁగూర్చు లయంబుఁగా ♦ వించునతని
కంభికానాధునకు వంద ♦ నం బొనర్తు.

తే॥ తనశ్రితావన నిరతి యెం ♦ తయు వెలుంగు
శూరపద్మాదిదానవ ♦ శూరవితతిఁ
దనకు వాహనములఁ జేసి ♦ కొనినవాఁడు
దేవసేనాధిపతిని మ ♦ దిఁ దలంతు.

క॥ సౌందర్యామృతవల్లుల
నిందునిభాననలఁ దనకు ♦ నిల్లాండ్రుగఁ జే
ర్మిందగఁ బరిగ్రహించిన
స్కందుఁడు సంతతము దిక్కు ♦ గావుత మాకున్.

వ॥ అని తత్తద్దేవతాధ్యానంబుఁ గావించి మహామునులఁ గాంచి
మెల్లన నిట్లనియె.

చ॥ వరసుమనోభిరామమయి • స్వర్గమునాఁ జెలువొంది సద్గుణ
స్ఫురణఁ జెలంగుటన్ రజత • భూధరముం బతెఁ బేరు సెంది శ్రీ
గురుచరణాంకితంబయి వి • కుంఠమునన్ బ్రథ గాంచి మించియు
ర్వరఁ బరిపూర్ణసంజ్ఞిక పు • రంబు కరం బలరారు స్తుత్యమై.

తే॥ ఆపురం బిందిరాదేవి • కాపురంబు
కాపురము గాదు ముక్తిస • తీపురంబు
భూపురంధ్రికి రత్నాల • నూపురంబు
శ్రీపురే దానికెనయగు • నేపురంబు.

సీ॥ తమ ధర్మమును వీడ • క మతాంతరుల దూర
కన్నిటను సమర్థు • లైన ద్విజులు
చంపఁదగినయట్టి • శత్రువునైనను
శరణు వేడిన బ్రోచు • క్షత్రియులును
హెచ్చు లాభముఁ గోర • కెట్టివారలకైన
సరితూచి యొసఁగు వై • శ్యకులజులును
తఱిఁ గాంచి పనుల నా • దరమున నుపయోగ
సరణి నుంచెడి వ్యవ • సాయికులును
ప్రాడ్వివాకులు గాక య • ప్రాజ్ఞజనులఁ
గూడి తిరుగక గుణములఁ • గొఱఁత సేయ
కడగి మడిగి ప్రవర్తించు • నట్టి వటువు
లప్పురంబున వసియింతు • రనుదినంబు.

క॥ ధనలోభంబును జెందక
కనికరమున శిష్యవితతిఁ • గన్నసుతులఁ బో
లెను గాంచి విద్యఁ గఱపెడు
ననఘు లుపాధ్యాయు లుందు • రన్నగరమునన్.

చ॥ అలసులు లేరు దబ్బరల • నాడెడువారు వసింపరందుఁ జం
చలమతిఁ గాలయాపనము • సల్పెడువారలు కానరారు నె

ప్పెలులయి ద్రోహచింతనము • సేయఁదలంపరు గేస్తురా
రలు కయసంగి నెద్దియొ యొ • కప్డుకనంబడ దప్పురంబున
తే॥ పీరు చుట్టలు పెరవారు • వారటంచుఁ
దలఁపకింతయుఁ బక్షపా • తంబు విడిచి
యెల్లయందును నొకరీతి • నే చరించు
పూతచరితు లప్పుర రాజ • మున వసింత్రు.
క॥ తమవారి కెట్టి యుపకా
రము గల్గినఁగాని సైచి • రాజసభల స
త్యము నె ప్రియంబునఁ జెప్పుదు
రమలినచరితులగు సాత్త్వి • లన్నగరమునన్.
చ॥ కలహము రూపుమాపుటయె • కార్యముగాఁదలపోసి ధఁ
బలికి శ్రమంబు నొకప్రతి • వాదికి వాదికి నైకమత్యముల్
గలుగఁగఁజేసి వారొసఁగు • కాసయినన్ బదివేలటంచు
దలఁతురు న్యాయవాదులు ము • దంబున నప్పురమందుని చ
తే॥ ఆత్మజుండైన శాత్రవుఁ • డైనఁగాని
ధర్మమార్గంబుఁదప్పిన • తడవు సేయ
కొక్కరీతిని శిక్షింతు • రుచితగతిని
రాజు లప్పురిఁగీర్తి వి • భ్రాజులగుచు.
చ॥ కలనయినన్ స్వధర్మమును గాదని యన్యపథంబుఁ ద్రొక
రలఘులు భూమినాథు లెపు • డైనఁ బ్రమాదవశంబుఁ జేసి
చలమతులైరయేని తమ • స్వామికిఁ దత్త్వము బోధసేసి ని
ర్మలముగఁ ద్రోవఁజూపుదు రమాత్యులు నీతికళావిశారదు
క॥ పతిసేవానింతలగుచు
నతిథుల నాదరముతోడ • నర్చింతురు సం
తత మార్గాచరణార్హా
ప్రవృత్తలై చరియింతు రప్పు • రంబునఁ గాంతల్.
తే॥ మఱచియేసలాతి • తెఱవలఁగాంచరు
కాంచిరేని భక్తి • కలితులగుచు

మాతృభావమూని ♦ మన్నన సేయుదు
రప్పురమున యువకు ♦ లైనవారు.

చ॥ కడకొని కప్పుటాల్మలిచి ♦ కట్టిన మేడలమీఁద నాఁడురా
పడఁతులు చెంతనున్న హిమ ♦ భానుని దర్పణమంచుఁ జేతులం
దిడుకొనఁబోవ మచ్చపడె ♦ నింతియకా కమలారిదైన యా
య్యెడు పతియందు జింక మెటులుండుపొసంగునె యిట్టికల్పనల్.

చ॥ జలరుహలోచనా వదన ♦ చారు శశాంక కరప్రవచ్ఛితో
పలమణిసౌధనిగళిత ♦ వార్ఝరముత్తమ దేవతాంగనా
వళికి ముదంబుఁ గూరుపఁగ ♦ స్వర్ణదినాఁ బడెఁగాక యట్టిని
ర్మల జలపూర మెవ్విధి సు ♦ రప్రకరంబునకున్ లభించునో?

చ॥ అమరధునీతరంగముల ♦ నాడితదంబు కణంబులూని వే
గమ మలయాద్రిశృంగమునఁ ♦ గాలిడి పుష్పసుగంధభూతిభా
రముఁగొని మెల్లమెల్లఁగఁ బురంబునఁ ద్రిమ్మరుచుండు వాతపో
తములు నిజాశుగత్వమును ♦ దద్దయు వీడుచు సంజవేళలన్.

క॥ ఆపురము నేలు సకలా
శా పూర్ణయశోవిశాలుఁ ♦ డరివీరజయ
వ్యాపారరతుఁడకుంఠిత
చాపుఁడు ధనురాస్యుఁడను ని ♦ షాదవరుఁ డొగిన్.

చ॥ చదువనివారి పైగినియు ♦ సత్యముఁ జెప్పనివారిరోయు సం
పదకలదంచు నుబ్బు కుల ♦ పాంసనులన్ క్షమియింపఁ డింత యా
పదఁగొనియున్ స్వధర్మములఁ ♦ బాయని పెద్దల నాదరించు వ్యా
ధదయితుఁ డాత్మకౌశలముఁ ♦ దజ్ఞులు మెచ్చఁగ నెల్లవేళలన్.

చ॥ కలుషపథంబుఁ ద్రొక్కఁ డరి ♦ గాపులు వచ్చిరయేని వాడిచూ
పులఁ బరగింపుఁ డాశ్రితులఁ ♦ బ్రోచుటమానఁడు క్రూరకర్మముల్
సలుపఁడు లాతివారియెడ ♦ లన్ గుణమున్న గ్రహింపకుండఁడా
లలితయశోబ్ధి వ్యాధపతి ♦ లాలన సేయఁగలండు పౌరులన్.

ఉ॥ మొనసిన వైరివీరుల న ♦ మూలముగాగ వధించు
దను శరణన్నవారి దయఁ ♦ దాల్చి బహూకృతిసేసి పంపు నెం

దు నవజయం బెఱుంగఁడు కౌతూహలమున్ బ్రకటించు నెల్లరన్
గనికరమూని కాచుఁబు ♦ కటకుఁ డా ధనురాస్యుఁ డెంతయున్

చ॥ అనుచరులన్ సుహృన్నిచయు ♦ మట్టులఁ బ్రీతిఁ గనుంగొనున్ సుహృ
జ్జనమును బంధుసంచయము ♦ చాడ్పునఁ గాంచుఁ గృతాధిపత్యముం
బొనరిచి బంధుసంతతికి ♦ మోదముఁ గూర్చు నిషాదవర్యుఁ డా
తని కౌశలత్వమున్ గని య ♦ థాయథలై పరవంగ శాత్రవుల్.

చ॥ కదలఁగ లేదు భూధరము ♦ కచ్ఛపమప్పుల మున్గి తేల దా
పదఁ గొని పంకమగ్నమయి ♦ పారదు కోలము వక్రగామియై
యదరుచుఁ బర్వులెత్తు భుజ ♦ గాధిపుఁ డంచు దలంచి యేమొ భూ
మదవతి తన్నె కొల్వ నన ♦ మానుఁడతండు రహించు నుర్వరన్.

సీ॥ స్వర్ణదీజలముల ♦ స్నానంబుఁ గావించి
మంచిగంధంబును ♦ మైనలంది
యైరావతంబును ♦ నారోహణ మొనర్చి
నాకవీథులను వా ♦ హ్యాళి వెడలి
చింతామణీభద్ర ♦ సింహాసనం బెక్కి
యప్సరోగీతంబు ♦ లాలకించి
తరుణేందు దత్తసు ♦ ధాపాన మొనరించి
శారదాసతితోడ ♦ సరసమాడి
రజతభూధరమున విహా ♦ రంబు సేసి
చక్రవాళాద్రి కావల ♦ సంచరించి
జగములం దెల్లఁ దానె కాం ♦ చంగఁబడుచు
వ్యాధకాంతుని సత్కీర్తి ♦ వరలు సతము.

చ॥ అనయము వ్యాధమౌళి నిశి ♦ తాసినికృత్త రిపుప్రకాండముల్
తనువులవీడి వాయుగతిఁ ♦ దారదె వచ్చుచునున్నవారటం
చనిమిషకాంత లెల్లరెదు ♦ రై సబహూకృతి రత్నహారముల్
పనివడి వారికంఠముల ♦ వైవఁగ నిల్చెద రాకసంబునన్.

చ॥ ప్రతినరపాలమస్తక వి ♦ రాజదనేకమణీమయూఖరం
జిత చరణాబ్జుఁడా నృపతి ♦ శేఖరుఁ డాదరమూని యర్థిసం

తతి కిడు వేళ దానజల • ధారలు చేరుటఁ జేసి యాసరి
త్పతిజలధిత్వముం గనియె • ధాత్రి ననంచు వచింతు్రు కోవిదుల్.

చ॥ చురుకుఁదనంబు కామినుల • చూపులయందును కర్కశత్వముల్
దెఱవల గబ్బిగుబ్బలన • ధీరత నింతులలోచనంబులన్
గొఱఁతవహించియుంట లత • కూనల మధ్యములందలాతిచోఁ
గఱవగునట్టులా శబర • కాంతుఁడు ధారుణి నేలు నిచ్చలున్.

తే॥ ఐదు పది సేయునట్టి యా • హవభటులును,
నలసులై చరియించు వి • ద్యార్థిజనులు
గీర్తిని గడింపఁగోరని • గృహపతులును
గలుగ నట్టులఁ బాలించు • నిల నతండు.

సీ॥ ఒకనాఁడు రాజనీ • తికుశలురైన ప్ర
ధానులతోడ మం • త్రణము సేయు
నొకవేళ సత్కవి • ప్రకరంబు లర్పించు
కావ్యకన్యకల వే • డ్కన్ గ్రహించు
నొకతఱి సామంతు • లకు దర్శనమిడి వా
రల కష్టనిష్ఠురం • బుల నెఱుంగు
నొకపరి మార్గణ • నికరంబునకు వాంఛి
తంబుదీరంగ దా • నం బొనర్చు
నొక్కపుడు బంధువులఁగూడి • యుచితరీతి
మంతన మొనర్చు సకల సా • మంత మకుట
కోటిఘటితమణి ప్రభాం • కూరపటల
రంజిత పదాబ్జుఁడగుచు నా • రాజమౌళి.

చ॥ మదగజముల్ తురంగములు • మానికముల్ రథముల్ పదాతిసం
పదయును గొంచుఁ దత్తదధి • ప ప్రకరంబనుపంగ నిచ్చలున్
బదపడి దర్శనార్థులయి • వ్యాధనృపాలుని మందిరాంగణం
బు దరిని వేచియుంద్రు హిత • ముఖ్యులు భానుఁడు గ్రుంకునంతకున్.

చ॥ సతతవియోగఖిన్నలగు • సారసనేత్రలఁగూడి శేషుఁడం
చితరతులన్ జెలంగె గిరి • శృంగము లూర్ధ్వ[illegible] ప్రాకె నీ

ప్సితఫలసిద్ధినొందెఁగరి । బృందము వ్యాఘ్రవిభుండు బాహులన్
క్షితితలముఁ వహించి నృప । శేఖరుఁడైయలరారుచుండుటన్.

తే॥ అతఁడు చిన్నతనంబున । యందు జనుప్ర
కొనునపుడు నాస్తియను శబ్ద । మును పఠించి
యెఱుఁగఁడో యేమొకాదేని । యెన్నఁడేని
నాస్తియని పల్కఁడే యించు । కైనఁగాని.

చ॥ పలుకఁడు విప్రలాపములు । ప్రల్లదముల్ విని సైపఁడెవ్వరిన్
సలుపఁడులాతివారల క । సహ్యముఁగూర్చెడికట్టి కర్జముల్
గలఁగఁడు మిన్నుపైఁబడినఁ । గాని ద్విపత్తులనైన నేరమున్
సలుపక శిక్ష శేయఁడు ప్ర । శస్తయశస్కుఁడతండొకింతయున్.

సీ॥ అరుణోదయంబున । కన్న ముందుగ లేచి
పరమేశ్వరధ్యాన । పరతఁ జేసి
నామోదనుచిత జ । లావగాహ మొనర్చి
భూతిరేఖలుగాఁగఁ । బూయు మేన
నంతసహస్ర రు । ద్రాక్షమాలికలూని
సద్భక్తి దేవతా । ర్చాగృహమున
వేదోక్తరీతినే । కాదశ రుద్రపూ
ర్వముగ లింగాభిషే । కమునొనర్చు
మఱియు శివపూజ శేయు స । మంత్రకముగ
క్రమముగ నవగ్రహారాధ । నమునొనర్చు
విప్రసంతర్పణముఁ జేసి । విహితబంధు
సహితుఁడై యారగించు న । చ్చలునతండు.

ఉ॥ ఇంచుకసేదదీర్చుకొని । యెవ్వరికేది హితంబొ దానిఁ గా
వించు నృపాసనస్థుఁడయి । వేగులనెల్లర మెల్లమెల్లరా
వించి యరాతిభూపతుల । వృత్తములన్ వినియూహరీతిఁ గా
వించు నతండజస్రము వి । వేకధురీణుఁడు కీర్తికాముఁడై.

మ॥ బలగర్వంబునఁ గన్నుగానకయు దే । బ్రాహ్మణాబాధ నం
బులఁగావింపక పాపభీతివిడి దు । ర్మోహాంధులై యన్య కాం

తలఁగామించెడి నాస్తికాదులకు స • ద్జ్ఞానంబుఁ జేకూర్చి ని
ర్మలభక్తిన్ గిలిగించు శాంతశర వి • భ్రాజత్కరాంభోజుఁడై.

చ॥ కరములఁబూజసేయఁదగుఁ గన్నుల నీశ్వరుఁ గాంచగాఁదగున్
జరణములన్ శశాంకధరు • సన్నిధిమెట్టఁదగున్ మృదూక్తులన్
బురహరు నామమంత్రములఁ • బూన్కి వచింపఁదగున్ దదన్యమా
చరణిఁ జరించినన్ శబర • కాంతుఁడు నైపఁదలంపఁ డెవ్వరిన్.

తే॥ సర్వసముఁడె యయ్యు • శబరేశ్వరుఁడు శ్రిత
ప్రకరమందుఁ బక్ష • పాతమూను
శాంతలెందఱున్నఁ • గాని శైలకుమారి
కర్ధదేహమిడఁడె • హరుఁడు తొల్లి.

క॥ ధనలుబ్ధుఁడుగాఁడు యశో
ధనలుబ్ధుఁడెయగును గాని • తజ్జ్ఞుల గోష్ఠిన్.
మనుగడకన్నను శివపూ
జనమె యధికమంచుఁ బల్కు • శబరేంద్రుఁడొగిన్.

తే॥ అనుసరించు బుధుల • వినుతించు కవులను
గనికరించు మునుల • గారవించు
మోహరించు రిపుల • మోహించు మగువల
నోహటించు భటుల • ద్రోహమెంచు.

ఉ॥ ఆతనిపూర్వులెల్లరు మ • హాశివభక్తులతండు శైవసం
ఘాతము పట్టుగొమ్మ శితి • కంఠపదాబ్జ సమర్చనారతుం
డై తనవారినందఱఁ బు • రారికి భక్తులఁగానొనర్చినాఁ
డాతతకీర్తిశాలి శబ • రాధిపుఁ డాస్తికలోకముఖ్యుఁడై.

తే॥ ప్రాణలింగార్చనాపరా • యణుఁడతండు
తనకు శరజన్ముఁడిలువేల్పు • గను సమస్త
వాంఛితంబులఁ గూర్పఁ న • వ్యాజభక్తి
శక్తిధరునిభజించును • సంతతంబు.

మ॥ తనకున్ ధర్మువుఁ గూర్చి యొక్కపుడు సిద్ధాంతంబు గావించు వ
ట్లనిజార్థంబుస్ఫురింపదేనిక్షణ కాలంబావిభుఁడ ద్విజా

తనయుఁగా ధ్యానముసేయుఁ దక్షిణమభ ♦ క్త్రాతయా స్కందుఁడా
తనికిఁ దత్వముఁ దోపఁజేయు శ్రితవాత్సల్యంబు విందైతగన్

తే॥ అతని ధర్మపత్ని ♦ యఖిల సుగుణగణా
భరణ దీనలోక ♦ శరణమనఘ
చరితనిరత శైల ♦ జా సమర్చావ్రత
బంధునికరవినుత ♦ పాపరహిత-

తే॥ కలిమిగలదాననసుచును ♦ గర్వపడదు
పట్టమహిషిననుచు నోరుఁ ♦ గొట్టబోదు
ప్రాయముగలదటంచు దు ♦ ష్పథము జనదు
శ్రితజనావనధుర్యయా ♦ సతనిభార్య.

ఉ॥ చేయదు భర్తకుఁ దెలియఁ ♦ జేయక యెంతటికార్యమైన స్వ
శ్రేయముఁగోరియే నోరులఁ ♦ జెట్టలఁ బాల్పడనీయదింత కా
త్యాయని పూజలేక కల ♦ నైన భుజింపఁగ నిచ్చగింపదా
తోయలి సాధుశీలయయి ♦ తోరఁపుబత్తినికాంతుఁగొల్చుచున్-

తే॥ కార్యములయందు మంత్రియై ♦ కరణములను
దాసియై యన్నమిడు వేళఁ ♦ దల్లియగుచు
ముదముఁ గలిగించుచో వార ♦ ముఖ్యవోలె
ధవుని చిత్తంబు రంజించుఁ ♦ దరుణి సతము.

క॥ తలవాకిట నిలువక చం
చలమతియై తిరుఁగబోక ♦ సఖునర్థంబుల్
వెలితివడనీయక త్రిమూ
ర్తుల గృహిణులువోలె శబరు ♦ తొయ్యలి యలరున్.

చ॥ పతికృపకాస్పదంబగుచుఁ ♦ బ్రాజ్ఞులకున్ దలయొగ్గిమ్రొక్కు దు
ర్మతులను రోషసంకలిత ♦ మానసయై దరిఁజేర నీదు సం
తత మతిథిప్రకాండము ను ♦ దారమతిన్ గిరుఁగించు నాపతి
వ్రతశబరేశ పూర్వకృతబంధుర పుణ్యచయంబు నానిలన్.

తే॥ పూర్వజన్మార్జితంబైన ♦ పుణ్యమున నె
తనకు సర్వసమర్థుఁడౌ ♦ ధవునిపాద

సేవ లభియించె నని సంత • సించు మదిని
సకల బుధలోక వినుతయా • శబరవనిత

సీ॥ ఏకారణంబున • నేనిధవుండు మన
స్తాప మొందినవాని • దాపుఁజేరి
వీణె వాయించియో • వేణువునూదియో
గానంబొనర్చియో • కావ్యనాట
కాదులఁ బఠియించి • యోదశాభేదముల్
తెలిపియో తేనియ • లొలుకు చిన్ని
పలుకుల వేడియో • పలువిధములఁ దన
నేర్పు కొలందిని • నేతమదికి
స్థైర్యమును గూర్చు మానవ • ధర్మమునకు
హానికూడదనుచు విన • యమున నాఁడు
బూర్వరాజన్యవృత్తాంత • ముల వచించు
నంగనాలోక సమ్మాన్య • వ్యాధకన్య

తే॥ అఖిల సుగుణసహిత • యైన వనితఁగూడి
శబరనాయకుండు • చారుకీర్తి
కలితుఁడగుచుఁ బ్రజలఁ • గన్నబిడ్డలఁబోలెఁ
గాచుచుండుఁ గరము • కనికరమున:

వ॥ మఱియు నాథను రాస్యుండు పురందరుండుంబోలె నహాప్రాజ్ఞుండును చ
తురాస్యునివలె లోకగురుండును నారాయణుండువలె శ్రీపతియు భూతే
శుండునా సర్వజ్ఞుండును, దివాకరుఁడట్లు లోకబాంధవుండును శశాంకు
నివలెఁ గువలయాహ్లాదకరుండును నై సర్వదేవతా మయత్వంబు ప్రక
టించుచు నుపశమిత జగదుపప్లవుండును రక్షితసాధులోకుండును,
శిక్షితశత్రుమండలుండును దిగంతవ్యాప్త కీర్తిచయుండు నైధర్మం
బు మీఱక కర్మంబుమానక గుణంబులవీడక ధనుర్విద్యా విశార
దుండు నై బృహస్పతిం బోని నీతి శాస్త్రపారంగతులును సుమనో
హితులునగు మంత్రిపుంగవులు సేవింప మహావైభవంబునఁ గాలం
బుగడపుచు నొక్కనాఁడు

శశాంకుండు పరిపూర్ణకళాకలాపంబున మింటవెలుంగుతఱి నవరోధజనదర్శనోత్సాహంబు ప్రోత్సహింప నుచితవేషంబున నంతిపురంబున కరిగి యుపవరకాంగణంబుఁ ప్రవేశించి యంతర్భాగంబున దృష్టినిగుడించి.

చ॥ అకట యిదేమి కారణమొ ♦ యబ్జముఖీమణి త్యక్తభూషణ
ప్రకరసజీర్ణవస్త్రయయి ♦ వాడినచంపకవల్లియుఁ బలెన్
వికలతనొంది ధైర్యము వి ♦ వేకముఁ గోల్పడియున్న దేలయో
యింకముదమున్ ఘటింపఁ దెలు ♦ పెయ్యది దోఁచదు నాకుసుంతయున్

క॥ తనకున్ గూర్చు వయస్యన్
గనుఁగొని దయనీయమైన ♦ కమ్మనిపలుకున్
వినిపింపఁ బోవుచున్నది
వనితయదెద్దియొ యెఱుంగ ♦ వలదే నాకున్.

తే॥ అనుచు ద్వారదేశ ♦ మందొక్కచో భయ
కంపితాంగుఁడగుచు ♦ ఘనుఁడు నిల్చి
తన వెలది విచార ♦ ము నెఱుంగు నాసము
మ్మరముగాఁగనుండె ♦ మైత్రి దనర.

వ॥ అప్పుడా ధనురాస్య నిలాలుల్లంబునఁ బెల్లగిల్లు విచారంబున నెచ్చెలి కిట్లనియె.

చ॥ వినమె పురాణసంతతులఁ ♦ వేదములం దనపత్యులైనవా
రనయము దుర్గతిన్ బడుదు ♦ రంచును సంపద లెన్నియుండియున్
దనయులు లేకయున్న వని ♦ తా యిల సర్వముశూన్యమై మనం
బునకు నదృశ్యశోకమయి ♦ ముంచునుగాదె విపత్పయోనిధిన్,

మ॥ తినఁగట్టంగను లేక యెల్లయెడలన్ ♦ దీనత్వముంజెందు నా
తనకిచ్చున్ వలదన్నఁగాని బహుసం ♦ తానంబులన్ గానవ
చ్చిన సన్యాసులఁ బుటలన్ గొలుచు ల ♦ క్ష్మీపుత్రునిన్ బుత్రద
ర్శన భాగ్యంబును జెందనీఁడు విధియా ♦ స్రష్టృత్వ మేలాటిదో.

చ॥ చిలుక కనేకవర్ణములు ♦ జీవితమీయక మాలకాకిమూ
కలఁ జిరజీవులన్ సలిపెఁ గాన బెఱుంగు ముసిండిచెట్లకున్

ఫలము లొసంగియున్ జెఱుకుఁ బ్రాకులముక్కలుగాఁగఁజేసి నా
జలరుహసంభవుండతని ♦ సల్పిన కృత్యము నేమనన్ దగున్

ఉ॥ ఆతఁడు సృష్టికర్తయున ♦ యాం బతనిన్ భజియించు వారికిన్
జేతము సంతసించుగతిఁ ♦ జేయఁగలండు మహానుభావుఁడన్
ఖ్యాతివహించినాఁడతని ♦ కన్న జగద్గురుఁడేడి యట్టివాఁ
డే తనభక్తసంచయము ♦ నివ్విధి వంచనచేయు టొప్పునే.

తే॥ ఎట్టి క్రూరకర్ముఁ ♦ డేని తనకుఁగల
భంగినాశ్రితుల కొ ♦ సంగుననఁగ
సర్వజగము భర్త ♦ జలజాసనుఁడు సేవ
కులను బ్రోవకున్నఁ ♦ గలదె దిక్కు.

చ॥ అవసరమైనయప్పుడు ♦ సహాయముఁజేయఁగరాని యట్టిబాం
ధవులును బ్రొక్కినంత దయఁ ♦ దాల్చి వరం బిడలేనిదైవమా
హావమునన్ బొరకుండిన హయంబును గ్రక్కునవీడు టహా హా
నవనిసటంచుఁదజ్జజను ♦ లాడెదు వాక్యము విస్మరింతునే.

చ॥ వ్రతములసల్పితిన్ విభుధ ♦ వర్గముఁ గొల్చితి భక్తియుక్తి సం
తతము శిలాదసూతికిఁ బ్ర ♦ దక్షిణముల్ బొనర్చితిన్ జగ
ద్ధితమును గూర్చు యోగివరు ♦ లిచ్చిన మూలికలెల్ల మేనఁదా
ల్చితి నకటా యొకందును ఫలింపక వ్యర్థమెయయ్యె నాయెడన్

తే॥ సిరిగడింపలేని ♦ పురుషుని జన్మంబు
కడుపు పండకున్నఁ ♦ గాంత బ్రతుకు
లాతి మెప్పువడని ♦ యాతని విద్యయు
వ్యర్థమేయగును గ ♦ దా ధరిత్రి.

చ॥ జిలిబిలిపల్కుఁ దేనియలు ♦ చిందఁబదంబుల గజ్జెలందియల్
ఘలుఘలుమంచుమ్రోవఁగ విలాసగతిన్ జనుదెంచి చిన్నిచే
తుల మెడవైచి చిర్నగవు ♦ తో గిలిగింతలువెట్టు పుత్రుఁగ
న్నులఁగను భాగ్యమెప్పుడగు ♦ నో విధియెవ్విధిఁ జేయఁబూనునో.

క॥ అడుగులు తడఁబడ నేలన్
బడుచును లేచుచును చిన్ని ♦ పరుగున నాకై

యడరుచు నేఁడ్చుచుఁ బిలిచెడి
కొడుకుఁ బడయఁ బుణ్యమింకఁ • గూడునో లేదో.
ఉ॥ పాపముఁ జేసిపుట్టితిని । ప్రాక్తనజన్మమునందుఁ దత్ఫలం
బీపదిగిన్ ఫలించె నిపు । డెవ్వరి వేడిన నేమిచేసినన్
దాపమె కల్గుఁగాని సుత । దర్శన మింక లభింప నేర్చునే
పాపము తీరునే సుతుల • భాగ్యము నాయెడలన్ ఫలించునే.
తే॥ అనుదినంబన పత్యసం । జనితదుఃఖ
వననిధి నిమగ్నఁడైనట్టి । వ్యాధపతికి
సంతసం బెవ్విధమున । గల్గింతుఁ నహహ
యుండియును లేనిదాననై । యుంటి జగతి.
తే॥ అనుచు బరిపరివిధముల । ననులతాంగి
పలుకులాలించి వ్యాధభూ • పాలకుండు
స్వాంతము చలింప నాప్రదే । శమున నిలక
సతులకడ కేఁగుటయును వా • రతిముదమున.
వ॥ ప్రత్యుద్ధానాభివందనములఁ గావించుటయు, నహాసనోప
విష్టుండై శబరకాంతుండు దేవేరి కిట్లనియె.
మ॥ తరుణీ చింతలనేల నీకు భగవ • త్సంకల్పితంబై చరా
చరలోకంబు జనించునం దెవరికే • చందంబుగల్గించు నా
పరమేశుం డటులౌను దానికయి య । ప్రాజ్ఞానలెన్ నెమ్మదిన్
స్థిరతన్ గోల్పడ లాభమేమి? తనువుల్ • జీర్ణంబు గాకుండునే.
మ॥ జనకుం డెవ్వఁడు పుత్త్రుఁ డెవ్వఁడిల నీ • సంబంధ మేరీతిగా
జనియించెన్ మఱి యెంతకాలమిటులన్ • సంసారమన్ సాగరం
బున మగ్నుండయి యెల్లకృత్యముల సం • ల్పున్ దెల్విలేకింతయున్
మనుజుండెంచుఁ దలంపకూడదె యసం • వ్యాగ్రంబె కాంక్షింతురే.
తే॥ ఈశ్వరేచ్ఛ లేక • యేకార్యమేనియు
సుంతయైన జరుగ । దింతమాత్ర
మెఱుఁగలేక కుందు • చేల పామరులట్లు
సర్వమునకుఁ గర్త • శశిధరుండు.

ఉ॥ ఆతరుణేందు మౌళి కరుణాతిశయంబునఁ జేసి సర్వలో
కాతిశయాళు వైభవము • సందితి మంచుఁ దలంచి భక్తిమై
చేతము నీశ్వరార్పణముఁ • జేయక దుర్లభవస్తులబ్ధికై
ప్రీతివహించు టేమిటి క • భీష్టము తీరదె యహా వేళలన్

క॥ తనపూర్వపుణ్యసంచిత
మున గల్గిన దాని కెదను మోదించుచు లే
దని లేని దాని వగవక
మనుట యుచితమార్గ మంద్రు • మనుజావళికిన్.

ఉ॥ చందురునందు నైల్యము తు • షారగిరిన్ బెనుమంచు సాగరం
బందు భయంకరార్భటి మ • హాకవులందు దరిద్రతాప్తియున్
జందనభూరుహాంబుల భు • జంగమసంతతి భాగ్యరాశియం
దుం దనయుల్ లభింపమియుఁ • దొయ్యలి సాజమె కా ధరిత్రిలో.

క॥ అనిశ శివారాధనముం
బొనరించుచుఁ గాలమెట్లో • పుచ్చఁగవలెఁగా
కొనరని యర్థంబునకై
మనమున వగపొందుటహా • మా ప్రాజ్ఞులకున్.

చ॥ వనజభవుండు సృష్టిసలు • పంగ నిముక్తుఁ డవారి కెవ్విధం
బున నుడుటన్ లిఖించునది • మోఘము గాదయుతాబ్దముల్ తపిం
చినను ఫలంబు లేదు తమ • చేసిన కృత్య మవశ్యభోజ్యమా
నని తలవాంచి త్రిమ్మరుట • యహాము కోవిదులైన వారికిన్.

క॥ తన కెల్ల గతులఁ బూర్వం
డనివిధిఁ దూరంగ నేల • యహాంబగురీ
తిని నడచుచుండువారల
కనయము భద్రములుగల్గు • నంద్రు మునీంద్రుల్.

క॥ ఇదిలే దదిలేదనుచున్
మదివగవంగ నేల మన కుమాసుతుఁడు సిరుల్
పొదలించువాఁడు గలఁడా
సదయాత్ముని చరణసేవ • సల్పుము భక్తిన్.

క॥ ప్రతిదినము దేవసేనా
పతిచరితామృతముఁ గ్రోలి । పరమానంద
స్థితిఁ గాంచి మించువారికి
మతివగ వేమిటికిఁ గలుగు । మానిని చెపుమా?

ఉ॥ దైవకృతంబులైనయవి । తప్పవటంచును విశ్వసించి యా
పోవనియున్కిఁ బీడి వగ । పుల్ సుఖముల్ సరిజేసి ధర్మసం
భావనకార్య మప్పు డభి । మానముఁ బాసి తటస్థులై యు
ద్భావము లేక త్రిమ్మరుట । ప్రాజ్ఞులకుల్ దగునండ్రు కోవిదుల్

చ॥ కరములఁ బూజ సేయఁదగు । స్కందుని వీనులఁ గార్తికేయు
చ్చరితము లాలకింపఁదగు । స్వాంతమునన్ శరజన్మురూపః
స్థిరముగ నిల్పఁగాఁదగు న । శేష సురార్చితమత్కృతంబు
దురితములన్ హరింపుమని । తోరపు పల్కుల వేఁడఁగాఁదగ

వ॥ ఎట్టివారికిని సంసారసాగరోత్తరణవాంఛ యహీనంబగు
తన్నిమజ్జనంబుఁ గోరుట లగ్గుసేయుని నిషాదపుంగః
ప్రియాంగనకు హితోపదేశంబుఁ గావించెనని పలికిన
హావకణినిఁ గాంచి మునీంద్రు లవ్వలి కథావిధానం బానతీ
యని యడుగుటయు నాతం డిట్లనియె

ఆశ్వాసాంతము

క॥ అనవరతసాధులోకా
వనతత్పర సకలసుకవి । వర్ణితచరితా
వినుతగుణకృష్ణవేణీ
తనయా లేఖకవిశారద । దా న్యాయనిధీ

సీ॥ ఏమహామహుఁడు శ్రీ - వేమనారాధ్యనం । దనకిఁ బూర్ణశ - శాంకుఁడయె
నేతల్లి సావిత్రి - కినయై బుధుల్ మెచ్చ । మహిని పాతివ్రత్య - మహిమఁ గాంచె
నట్టినందనుకు గా - రవమనుద్వితీయపు । త్రుండఁ గౌండిన్యగో - త్రుండ దక్షి
ణామూర్తికిని శివా - నందునకును సోద । రుండఁ గూరిమియ గ్ర - జుండ సుబ్బ
నార్యునకు పౌత్రుఁడను మహీ - యమయియాలరు । నట్టివల్లీపరిణయ కా - వ్యంబు
నమల మగుప్రథమాశ్వాస - మయ్యెదీని । సతము రక్షించుఁగావుత - జంద్రమౌ

శ్రీ శివాయ నమః.

# వల్లీ పరిణయము.

## ద్వితీయాశ్వాసము.



క॥ ప్రతివాది వాదఖండన
చతురా చతురాస్య వం ♦ జలనిధితారా
హితహిత ధనవత్కుల సం
గతగత దురితౌఘముక్తి ♦ కాంతానకా.

తే॥ అవధరింపుము కణ్వమ ♦ హర్షిఁ శాప
సంభవచ్ఛివము నిమన ♦ శ్చలన జనిత
శబరపతి సుకృతప్రాప్త ♦ శరజహృదయ
కలితవల్లీ పరిణయమున్ ♦ కథను వేడ్కఁ.

కం॥ ఆపరిపూర్ణాఖ్యా కపు
రీ పశ్చిమ భాగమున వి ♦ రించినిపుణతా
దీపకము సర్వసత్వ
ప్రాపకమగు వనమొకండు ♦ రాజిలునెపుడున్.

చ॥ అనవరత ప్రయాణముల ♦ నంఘ్రులు వ్రయ్యలు వారవిశ్రమం
బునభిలషించు సూర్యహయ ♦ ముల్ శ్రమఁదీర్చుకొనంగనహర్నిశా
ననివిధియేర్పరించు తలి ♦ రాకుల పాన్పులునాఁగనవ్వనిన్
దనరుమహీరుహాగ్రములు ♦ తద్దయునాకసమున్ గ్రమించుచున్.

ఉ॥ ఏముద్విజ ప్రకాండమున ♦ కెంతయుఁ మేలొనరింతు మారుకా
దేమని మర్మరధ్వనుల ♦ నేచిపరస్పరముం బెనంగు నా
భూమిరుహంబు లయ్యటవిఁ ♦ బొల్చునుఁ సాంద్రవిశాల శాఖలన్
బ్రాముచు నుష్ణభానుకర ♦ రాజిని జేరఁగనీక నుంతయున్.

సీ॥ కనఁబడవవ్వనం ♦ బున శుకపికశారి
కలు భీకరశ్యేన ♦ కులమెకాని
వినిపింప దెప్పుడు ♦ వీనులవిందగు
రుతము పయోదగ ♦ ర్జితమెకాని
చరలాడవింతయు ♦ హరిణ సంతానముల్
వ్యాఘ్రాది దుష్టమృగ ♦ గాళిగాని
వీవ వొకింతయు ♦ విమలానిలంబులు
ఘనతరంబగు ప్రభం ♦ జనమెకాని
ప్రాకులాడదు కీటక ♦ పంక్తి యచటఁ
బడగలను విప్పియాడుచుఁ ♦ బ్రిళయకాల
కీలికీలాభమైన కా ♦ కోలవిషము
వెడలఁగ్రక్కు మహోరగ ♦ వితతిగాని.
తే॥ మదకరిప్రభఞ్జ ♦ మాన శాఖా ఫెళ
ఫెళనినాదములకు ♦ భీతిపడుచు
ద్రోఁకలెత్తి జవము ♦ తోఁ బారు వానర
కులము కలకలంబు ♦ చెలఁగునందు.
తే॥ తమ్మిపానకముం ద్రావి ♦ బమ్మెరవడి
తీవె యుయ్యాల లూగెడి ♦ తేంట్లు లేవు
ముంగులకు విందొనర్చు భు ♦ జంగములును
కానరావొకనాఁడు న ♦ క్కాననమున.

మ॥ పవలైనన్ బెనుచీకువాలుగలిగిం ♦ పన్ జాలు తాపించవృ
క్ష విశిష్టాగ్రముసై చరద్విబుధయో ♦ షాపాదలాక్షారస
స్తవనీయాంతరమై మహీకుచము చం ♦ దానన్ దనర్చున్ నగ
ప్రవరంబై లవలీనివాసమను పే ♦ రన్ భూధరంబవ్వనిన్.
క॥ పరమతపోధనులగు ముని
వరు లయ్యాచలంబు శృంగ ♦ భాగంబున సు
స్థిరమతులై తపమొనరిం
తురు గిరిజాధీశు నఖిల ♦ దురితవినాశున్.

చ॥ సరసిజసంభవాద్యమర ♦ సంతతి యొక్కొకవేళ నమ్మహీ
ధరశిఖరంబునందు వివి ♦ ధ క్రతువుల్ బొనరించి యధ్వరే
శ్వరుఁడగు సోమశేఖరు ప్ర ♦ సాదము గైకొనుచుండు నుత్తరో
త్తర మపవర్గసౌఖ్యమును ♦ దద్దయుఁ గూర్చునటంచు భక్తిమైఁ.

తే॥ నింగినొరయునట్టి ♦ శృంగంబుల బెడంగు
హోమధూమచయము ♦ హాయులఁ నమృత
కరములైనలతల ♦ క్రమతయునున గే
శ్వరుని మహిమ నెపుడు ♦ జాటుచుండు.

ఉ॥ ఆలవలీనివాసగిరి ♦ కంతికదేశమునందు శుభ్రవా
ర్జాలములై చలద్భ్రమర ♦ ఝుంకృతశోభితసారసాంతరం
బై లలదూర్మి నృత్యదురు ♦ హంసకులాకులమై మనోహరం
బై లవలీసమాఖ్యజల ♦ జాకరమొండు చెలంగునిచ్చలున్.

క॥ నెలతా చెక్కడఁపుంజగ
తులునట్టివె మొట్లు వికచ ♦ తోయరుహంబుల్
ఫలభారానతతరుశా
ఖలు చెప్పక చెప్పఁగోలఁకు ♦ గౌరవమెప్పుడున్.

చ॥ అలఘు తపోసాధనాఢ్యులగు ♦ నచ్చటివాసులు సాంధ్యరాగసం
కలితతదంబువుల్ కరయు ♦ గంబులఁబూని యహః ప్రభుత్వమున్
సలిపి శ్రమంబుఁబాపుకొన ♦ సాగడుమిత్రుని దృష్టిదోషమున్
దొలఁగెడునట్లు సల్పుటకు ♦ నోయన సాధ్యలనిత్తురర్ఘ్యముల్.

చ॥ ఘనుల సమాశ్రయంబు ఫల ♦ కల్పన శక్తమటంచుఁ బ్రత్యయం
బునఁ బవమానుఁడమ్మలయ ♦ భూధరశృంగమునుండి డిగ్గిమె
ల్లన విరితావువున్ గొని విలాసగతిన్ లవలీజలావగా
హన మొనరించి తాపసుల ♦ కహర్నిధిన్ బచరించు సేవలన్.

క॥ ఆసరసి తటమునందా
వాసముఁగల్గించుకొని ప్ర ♦ భాభానుఁడు ధ
ర్మాసక్తచిత్తుఁడు సద
భ్యాసుండు శివాఖ్యుఁడొక మ ♦ హాషిన్ చెలంగున్.

చ॥ నిరత శివార్చనాపరుఁడ । నిందితచిత్తుఁడ తండుపారమే
శ్వరమగు యోగముంగొని య । పార తపంబొనరింపఁగాంచె ని
ర్జరపతికంపమొందు ముని । సంతతియబ్బురమొంది యిట్టి దు
ష్కరతపముంబొనర్పఁగల శక్తుఁడెవండని యెంచునాత్మలో.

చ॥ అతికుశలుండతండ హర । హంబు తపంబొనరించుచోసమం
చితగతి వాయుభక్షణమె । చేయునుగాని క్షుధార్తుఁడై ఫల
ప్రతతియొ కందమూలములొ । పర్ణములో భుజియింపఁడింతయే
నతని ప్రభావమెట్టిదియొ । యాతని పూనిక యెట్టిదోగదా?

తే॥ అరిచయంబు గెల్చి ♦ కరణాశ్వసంతతిఁ
గట్టివైచి హృదయ ♦ కమలపీఠి
దరుణచంద్రధరుని ♦ స్థాపించి యమ్ముని
శేఖరుండు తపముఁ ♦ జేయుచుండు.

చ॥ బల మిసుమంతయేని కను ♦ పట్టదు దేహమునందు శల్యముల్
చెలఁగెడుఁగాని కన్నుల వి ♦ శీర్ణత నొందెను చూపు లాతివా
రల వచనంబులున్ వినఁగ ♦ రావు శ్రుతుల్ చతురంబులయ్యు ఱె
ప్పలు పలితంబులయ్యెను త ♦ పం బొనరించెడుపట్ల మౌనికిన్.

క॥ అముని లోకగ్రామణి
యేమిఫలముఁ గోరి యట్లు ♦ హీన తపంబున్
నేమమునఁ జేయునోయని
తాము తలంతురు తదన్య ♦ తాపసవర్యుల్.

వ॥ అవ్విధంబున మహానుభావుండగు శివాఖ్యుండు నిశ్చలచిత్తుండును విస్మృతాన్య విషయుండును నిరాహారుండునునై రత్నాకరంబుఁ బోలె గంభీరుండును, మేరునగంబుమాడ్కి స్థిరుండును కల్పవృక్షంబు పగిది నాశ్రితఫలదానచతుండును తారాధిపతిగతి ద్విజాగ్రసరుండును బృహస్పతిచందంబున సుమనోగురుండునునై తపంబుఁ గావించు దినంబుల నొక్కనాఁడు.

క॥ ఆసంయమిపతిలవలీ
కాసారముతటమున సహ ♦ కారతరుచ్ఛా

యాసంకలితంబగు నజి
నాసనమునఁ జేరియున్న ♦ యవసరమందున్.

తే॥ ఇనుఁడు తనవేడివేలుపు ♦ తనము సార్థ
కముగ నొనరించి చల్లఁద ♦ నము వహించి
పుడమి నెల్లెడ బంగారు ♦ పోఁతఁబోసి
యస్తగిరి శిఖరముఁజేరు ♦ నవసరమున.

తే॥ హరిణి యొక్కటి యాజల ♦ జాకరంబు
చెంతఁ దపసులు చిదుమ శే ♦ షించినట్టి
మృదు కుశాంకురముల మెల ♦ మెల్లఁదినుచు
బెళుకుచూపులఁగాంచు ది ♦ క్కులభ్రమించు.

సీ॥ చీమచిటుకుమన్నఁ ♦ జెంగునలంఘించి
పరువెత్తి యించుక ♦ తిరిగిచూచుఁ
జూచియచ్చట వింత ♦ చూపట్టకుండిన
మెలమెల్ల నడుగులు ♦ మెట్టినిలుచు
నిలిచిపీనుల నట్టె ♦ నిక్కించి యత్తెత్తి
చలమూని పచ్చిక ♦ సవునరయును
నరసి రుచింపమి ♦ నట్టెముట్టక ద్రోసి
కన్నీరు మున్నీరు ♦ గాఁగవిడుచు
విడిచి చెట్లనీడ ♦ విడియు విడిసిమఱి
నెమరువేయులేచు ♦ నెమకునెదియొ
కులుకులాడి వోలెఁ ♦ గోర్కులు గల్గించుఁ
జూపఱకుముదంబుఁ ♦ జూపుహరిణి

క॥ తన సృష్టిలోని నేరము
లను బాపుకొనంగమదిఁద ♦ లంచి సరసిజా
సనుఁడు మనోహరమగు సా
ధనముఁగొని సృజింపఁబోలుఁ ♦ దగనీహరిణిన్.

తే॥ ఎట్టికఠినచిత్తుఁ ♦ డేని యెంతటినిష్ఠ
ఘోరతపముఁజేయు ♦ ధీరుఁడేని

యాకురంగిఁ గన్న । యంతనాత్మఁ జలించి
కఱఁగినీరుగాక । కదలఁగలఁడే.

ఉ॥ కమ్మని తావు లీనుకసు । గందని సంపెగ తీవెవోలెఁజి
త్తమునకుఁ స్థిరమ్మగుము । దమ్మ ఘటించుఁ జరించు జాళువా
బొమ్మవిధంబుఁ నయన । ముల్ తనియంగనొనర్చు రమ్యగీ
తమ్ముఁబలెఁ శ్రుతిద్వయముఁ । దర్పణముం బొనరించు నేరికిఁ.

తే॥ ముగ్ధవోలె బెదరి । పోవఁగ నుంకిఁచు
మధ్యరీతి నుంత । మరలినిలుచు
ప్రౌఢరీతిఁగలిసి । పైకొనఁగఁ దలంచు
హరిణిఁగాంచి శివము । హర్షియపుడు.

చ॥ ఇది కమలాసనుండు రచి । యించిన సృష్టియెయయ్యొ నేనినా
మదికెపుడుఁ బొసంగని సు । మాళముఁగూర్పఁగ నేర్పునే బళా
మదనసమాఖ్య శిల్పియస । మానమనోహర వస్తుసంతతిఁ
బొదిగి సుధామధు ద్రవముఁ । బోసి యొనర్చిన బొమ్మగాకిలఁ.

చ॥ మరుఁడను వేటకాని శిత । మార్గణపంక్తికిఁ దాళలేక చె,
చ్చెరనిటు డాఁగఁగాఁదలఁచి । చేరిన వెన్నెలజేని తేజియా
హరిణియొ కాదయేని యొక । యన్య మృగంబున నిట్టి సోయగం
బిరవుగనుండ నేరుచునె । యెంతయు మమ్మభ్రమింపఁజేయునే.

క॥ ఈవిధి లోకోత్తరమగు
లావణ్యముఁగూర్చి దీని । లలనఁగఁజేయం
గావిధి తలఁపక మృగిగాఁ
గావించుట నేర్పులేమి । కతమున నెగదా?

తే॥ అనితలంచుచు నమ్మని । యతను చాప
ముక్తనారాచ సంచయం । బునకులోఁగి
తాను మృగరూపముధరించి । దానిఁగలిసె
మరుని గెల్వఁగ శక్యమె । వ్వరికిజగతి.

వ॥ అట్లా ముని శ్రేష్ఠుండు హరిణిఁ గలిసి క్రీడించి బ్రహ్మవిద్యాపూ
ర్ణుండుగావున నుత్తరక్షణంబున నె కురంగరూపంబు సంహరించి

స్థైర్యంబుఁ దాల్చి తనమనంబున

చ॥ వరలు తపస్సమాధినప । వర్గమె లక్ష్యముగాఁగ సోమసుం
దరవిభుఁగొల్చుచున్ నిరశ । వ్రతదీక్షఁ గృశించునాకుఁ గా
మునకుఁ బోలె నొక్కమృగి । మాత్రమునందనురాగబీజమి
ట్లురుగఁ దినాటెనంగభవు । నోర్చెడివారెవరింక ధారుణిన్.

చ॥ ఇల్లుభుజంగనిష్ఠజను ♦ లెల్లరు నక్రములాఁలు మృత్యువం
చల్లమునన్ దలఁచి యెటు । లో యొక యింతవిరక్తిఁ బూని యి
ట్లెల్ల శ్రమంబుఁలోర్చి గడి । యించిన మామకధైర్యమంత యీ
కల్లరి జింక కారణము । గావృథయయ్యె నిఁ కేమి సేయుదున్.

తే॥ కూడు నిద్దురయునుఁ । గొఱగాఁదపించు తా
పసవరేణ్యులేడఁ । గనవుమేయు
మృగములేడవాని । తగులాటమేడనో
మనుని కౌశలంబ । మానుషంబు.

వ॥ అని యించుక చింతించి మఱియు.

క॥ కారణములేక మనమ్మన
మీరీతిగ సంచలింప । దెపుడీ స్ఖలనం
బారయ నొక్క మహాకా
ర్యారంబునకు హేతు । వగునని తోచున్.

చ॥ ఇది పరమేశ్వరేచ్ఛ యిఁక । నీవిషయంబును గూర్చి సుంతయే
నెదవగపొందఁగూడ దెపు । డెయ్యది కాఁదగియుండు నప్పుడ
య్యది యగుఁగాని తప్పదు మ । హామతు లిట్టియెడన్ దటస్థులై
కుదురుగనుండు టహాఁమని । కోవిదులాడుచు నుందు రెప్పుడున్.

సీ॥ ఏవాని మహాత్మ్య । మిట్టిదంచు నెఱుంగ
బ్రహ్మాదులకు నుద । రంబుగాదు
ఎవనియందు జనియించు । నీభూతజాలంబు
జలధితరంగసంచయము మాడ్కి
నెవని సంకల్ప మిం । తేని వ్యర్థముగాదు
సుకవిప్రయుక్తవాక్కి । నికరమట్లు

లేవాని కరుణచే । నెల్లలోకంబులు
                                        నుత్సాహవార్నిధి । నోలలాడు
నట్టి దేవదేవు । నాదిమధ్యాంతవి
రహితు వేదవేద్యు । రమ్యచరితు
ననఘు నిర్వికల్పు । నన్మదుపాస్యునీ
శుని దలంతు భక్తి । వినయములను.

వ॥ అని యనేకవిధంబులఁ జింతించి యీశ్వరధ్యాన జలంబుల మనోమాలిన్యంబుఁగడిగి స్నానంబొనర్పఁగోరి జలజాకరంబుఁ జేరబోయె. ఈలోన మునిసమాగమ మాత్రంబున నాకురంగి సద్యోగర్భంబుఁ దాల్చి జలపానార్థంబాలవలీ సరస్తీరంబునకరిగి యందొక నిర్మల సోపానంబున మనుజబాలకఁ బ్రసరించి యది విజాతీయ యగుట సంభ్రమంబున నెందేనరిగె నప్పుడు శివాఖ్యముని యాశిశువుఁ గని యబ్బురంబున.

చ॥ అనుకొనినట్లె యయ్యెనిది । యాహరిణీముని రాట్సమాగమం
బునకు ఫలస్వరూపము త్రి । మూర్తులనేని తృణంబొనర్చు నీ
యనఘు లెఱుంగనట్టి విష । యంబులుగూడఁ బొసంగునేయిటుల్
మనసిజు కృత్యముల్ మదిఁద । లంపఁగ నెందు ఫలానుమేయముల్.

తే॥ పుత్ర మిత్ర కళత్రముల్ । శత్రువులని
యరసి వైరాగ్యమూని యి । య్యడవి జేరి
యున్నఁగాని తలఁగదయ్యె । నన్నుబట్టు
కొనిన చాంచల్యరోగమే । మఁగవచ్చు.

చ॥ మనసు చలింపనీయ కన । మానతపోవిధవాభి రాముఁడై
వనమున సంచరించునను । వంటి మునీంద్రున కొక్కజింకపై
కనుగవ చంచలించుటయుఁ । గన్యజనించు కెఱింగిరేని యే
మని మదినెంతురో సుకృతు । లబ్బురమయ్యెడు నింతచూడఁగఁ.

ఉ॥ ఈపసికూనకిందు గతి । యెయ్యదిజ్ఞానములేమిఁ దల్లియే
ప్రాపయి ప్రోవకీపగిది । భ్రాంతివహించి చలించిపోయె న
ద్వ్యాపృతి కారణంబయిన । యట్టితపస్థితినున్న నాకునే

లాపొసఁగుఁ గృహాధిపతి । లాగున దీనికి రక్ష సేయఁగన్.

చ॥ తనయులఁగాంచి పెంచుటలు । ధర్మముతల్లికి వారివృద్ధికై
యనయము కష్టమైన సుఖ । మైన నొకేగతినోర్చి దుష్కృతం
బునకును లోఁగకించుకయుఁ । బూని చరించుట తండ్రిధర్మ మీ
తనయుఁగుఱించి తల్లియును । దండ్రియునే నగుబెట్టులోయికన్.

చ॥ పురుషమృగేంద్రి గర్వమును । బోకడఁబెట్ట వివరించి మెల్లనన్
దరుణులు పుత్రిలాప్తులను । తాళ్ళఁబెనంగొను నీకుటుంబవా
గురమును బన్ని మోహమను । కొంతయెఱుక మెఱపించునట్టి నే
ర్పరియును దానఁజిక్కి పడ । రాని వెతన్ బడి నాశమౌనిలన్.

సీ॥ మోహంబునన్ గాదె । ముక్కంటి హరుఁడయ్యెఁ
దనమేన సాఁబాలు । తరుణికొసఁగ
ననురాగమునఁగాదె । యబ్జలోచనుఁడు ని
త్యము సతి నెదఁదాల్చి । యాదరించు
లోలత్వమునఁ గాదె । లోకేశ్వరుఁడు కాంతఁ
దలవాకిటన్ నిల్పి । మెలఁగుచుండు
కామమునన్ గాదె । క్రతుభుగధీశుండు
ముని పంచకోడియై । యునికిఁగాంచె
తపమె వృత్తిగఁబూనియే । తద్భవాబ్ధిఁ
దాఁటనుంకించు మానులెం । దఱో చపలతఁ
గాదె స్థైర్యంబుఁ గోల్పోయి । కంజముఖుల
నాశ్రయించిరి ధనాస్మ । యనుచుఁ దలఁచి,

చ॥ శరములు పూవులాప్తులుద్వి । జప్రకరంబులు ముఖ్యవాహినీ
శ్వరుఁడు కృశాంగుఁ డమ్మనుప । వర్గముబంట్లతనుండెయయ్యెఁజె
చ్చెర నొకకోలఁగైకొని య । శేషజగంబుల రూపడంచువాఁ
డరరెమరుండు వానికెటు । లబ్బెనో యిట్టియదృష్టమిద్ధరన్.

తె॥ బ్రహ్మచర్యంబు వెంటగా । హాస్యర్థముంట
నెఱిగియును గారవింపమి । నెదఁదలంచి
మదనహతకుండు మానుల । మత్సరించి

గాసిఁ బెట్టుచునుండు భం । గంబుఁ గూర్చి.

వ॥ బ్రహ్మచర్య గృహస్థవాన ప్రస్థసన్యాసంబులను నాశ్రమ చతుష్ట
యంబునఁ దృతీయ చతుర్థంబులు ప్రథమద్వితీయంబులు కారణం
బులుగ ముక్తికాంతాసాధక పాటవిపాటనంబుఁ గావింప సమర్థం
బులగు. మఱియు బ్రహ్మచర్యంబున వేదవేదాంగాది విద్యాభ్యా
సంబునను గురుశుశ్రూషాదులవలనను గాలంబుఁ గడపవలయు.
వానప్రస్థంబున శివపూజా పరికరసంపాదనాదులచేతను నాగంతు
కార్చనాదులచేతను తపోనిష్ఠచేతను సమయంబుఁ బుచ్చదగు.
సన్యాసంబునఁ బరమేశ్వర స్మరణంబొక్కండుదక్క నన్యచింత
నంబుకూడదు. మఱియు నొక్కెడ నసహాశన స్వీకారంబును వేరొ
క్కచో నుచితనిద్రయుఁ గలిగియుండవలయు. కావున విషయోప
భోగంబునకీ చెప్పినయాశ్రమత్రయంబు దూరంబగు. కామాను
భవంబులేక మోక్షగామి కాఁడనుట నిక్కంబుగదా.

క॥ కామసుఖజ్ఞానములే
కీమహి నెంతటి సమర్థుఁ । డేని తపమునన్
గామిత మోక్షప్రాప్తిని
వేమరు భంగంబు నొందు । విగతవ్రతుఁడై.

వ॥ ఏను బ్రహ్మచర్యానంతరంబ గార్హస్థ్యంబున నెట్టిదియో యెఱుం
కయె దుశ్చరతపోభిరతిఁ జేసి వనవాసినై యుంట నింద్రియాశ్వం
బుల బంధింపనేరని కతంబున నిట్టి విపరీతంబు సంభవించె. కడ
చినదానికి వగచినఁ బ్రయోజనంబేమి ? కావున నీ పసికూనకెద్ది
యేనాధారంబుఁ గూర్చుట నాకు విధియైయున్నది. కాదయేని
దోషంబు వాటిల్లు. ఈ విచిత్రనాటకం బొక మహాకార్యంబునకు
నిదానమనియేఁ దలంచినయది నిజంబయ్యె.

తే॥ పంచభూతములు కృ । పాంచితములగుచుఁ
దమకు సహాయమగు । విధమున దీని
రక్షసేయుఁగాత । వృక్షదేవతలకుఁ
గనికరంబు గలుగుఁ । గాత యింక.

చ॥ అనుచు శివాఖ్యుఁడా నిశువుహస్తయుగంబునయందుఁ బూనియొ
క్క నిబిడకుంజమధ్యమునఁ । గమ్మని తెమ్మెర వీచుచోఁట మె
త్తని విరిసెజ్జఁ జేర్చి తన । ధర్మవె దానిని బ్రోచుఁగాత మం
చని వనదేవతావళుల । కంజలిఁ జేసి చనెన్ గృతార్థుఁడై.

వ॥ అట్లా మునీంద్రుం డరిగిన యనంతరంబున.

సీ॥ కూని మూపులపైనఁ । బూనిన పందివ
లలు జారి యిరుకెలం । కులను బడఁగ
బాహుమూలమ్మల । బంధించినట్టి పొ
దుల బరువున భుజములు చలింప
గటిదేశమున బిగఁ । గట్టిన కాసెల
బిగువు కల్మిని డొక్క । లెగసియుబ్బ
మెలియఁజుట్టఁగఁ దప్పి । మెడమీఁదఁ బడుసాము
నెరసిన కేశముల్ । దురదఁగూర్ప
మోటకత్తులు సరిపెణ । లీఁటెగములు
పరశువులు సురిత్రాళ్లును । పరిఘములును
హస్తములఁదాల్చి మేము మే । మని కడంకఁ
బంతముల నాడెడి నిషాద । పంక్తితోడ.

తే॥ జాగిలంబుల యఱపులు । డేగగముల
కూఁతలును రేగి దెసల మా । ర్మోతలిడఁగ
వ్యాధపతి మృగయాసక్తుఁ । డగుచు నప్పు
డహార్యవేషంబుతోడ న । య్యటవిఁ జేరె.

వ॥ అట్లు జేరి ధనురాస్యుండు కొంతవడి వేటాడి యలసిన బలంబును
శ్రాంతంబైన యశ్వంబును గాంచి యించుక విశ్రమించు టుచి
తంబని తలంచి యందొక్క మహీరుహంబు నీడనందఱవిడియ
నియమించి కొలఁది సైన్యంబుతోఁచి పానన్ దీర్పఁగొని రాలవలీ
సరోవరంబుఁ గుఱించి యరుగువాఁడై కొంతదవ్వు సని.

చ॥ అళికులఝంకృతింబలె ము । దావహమై చదలేటిశీకరం
బుల గతిఁజల్లనై చిలుక । బోదెలకూఁత విధంబునన్ గృపన్

గలుగఁగఁజేయునట్టిదయి కమ్మని వీణియనాద మట్లవీ
నుల నలరించునట్టి యొక నూత్నరవంబు చెలంగె నంతటన్.

క॥ ఇది యెచ్చటి శబ్దంబో
మృదుమధురంబగుచుఁ జెవుల కింపు ఘటించున్
ముదముఁ గలిగించు మదికిన్
బదపడి యిద్దాని నరయ వలయును గాదె.

వ॥ అని మెల్లమెల్లన నడచుచు మరల వారలఁ జెవియొగ్గి వినుచునం
దందాశబ్దకారణంబు నరయుచు యథార్థంబుఁ దెలియలేక యొక్క
బోయముదుకనిఁగాంచి యిట్లనియె.

చ॥ వినవె వివేకిమాత్రసుఖ వేద్యము నిర్మలనాదమివ్వనం
బున నెటనుండియో పొడము బూరుషబుద్ధి కగోచరంబుని
ర్జన మిదిమానవధ్వనిపొ సంగునె వ్యక్తముగాని దానినే
మనిఁయిఁక నిర్ణయింపఁగల మయ్యమనంబు చలించునియ్యెడన్

తే॥ అనుభవజ్ఞుఁడవీవు నీ యంతవాని
యుండగలేన నెట్టికా ర్యంబునైన
న ప్రయాసంబునన్ జేయ నగును గాన
వృద్ధుఁడవు వత్తువే వెను వెంటనుంత.

క॥ వీరీవృక్షచ్ఛాయన్
జేరి ప్రతీక్షించుచుండ్రు చెచ్చెరమనమీ
దారినచని యాశబ్దం
బారసివచ్చెదము రాఁగ దయ్య కడంకన్.

చ॥ అనిలహతిన్ జలించిపడి నట్టివిజీర్ణ పలాశసంతతుల్
కనిమెలమెల్ల వీనిపయిఁ గాలిగడగాఁదగు నింతమర్మర
ధ్వనియగునేని వాంఛితము భంగమగున్ వినదంబుగల్గు త్రో
వనెఱుఁగలేకయే మనకు వచ్చిన దారిఁజనంగ నయ్యెడన్.

క॥ అని వచియించుచు నాముదు
కనిచెయిఁ బట్టుకొనిశబర కాంతుఁడు మెలమె
ల్లనముందుజనుచు నాతని

గనుఁగొని యిట్లనియెను తృ । కతయలరారఁగన్.

చ॥ ఇవి పెనుగాలికిన్ విరిగి । యెంతయు నేలకువంగి రాచుచు
న్నవితరుశాఖలీ పయిఁగ । నంబడదింతయు మార్గమల్లదే
సవిధమునన్ విశాలతరు । శాఖల క్రిందుఁగ గాలిత్రోవయ
ట్లవిరళరీతిఁ గన్పడెడు । నవ్వగులేగిస చొప్పుచూచితే.

ఉ॥ ఈయటవీప్రదేశమున ♦ కెప్పుడువచ్చుఁ బోవుచుండె దీ
వాయువు దుష్టజంతువుల ♦ నంతయొనర్చి మునీంద్రవర్గమున్
హాయి గనంగఁజేయుదు గ ♦ దా యదియంతయు విస్మరించితే
యేయెడ నెందుఁబోవఁ బథ । మేర్పడయుండెడినో యెఱుంగఁగన్.

తే॥ అవ్విధంబున ధనురాస్యుఁ ♦ డతనితోడ
మాటలాడుచుఁ గొండొక ♦ మార్గమునను
గొంతదవ్వేగి కని యెన ♦ ప్రశాంతమధుర
పావనజలంబులవలీస ♦ రోవరంబు.

క॥ కనుఁగొని యాజలజాకర
మున నించుక నీరు ద్రావి । ముదితాత్ముండై
యనుచరుఁడు దోడరాఁగొల
కునకు సమీపమున నొకని ♦ కుంజముఁగాంచెన్.

క॥ కాంచి తదంతర్భాగో
దంచితసుమరాశిఁజేత ♦ నాఢ్యకనకపుం
బాంచాలికగతిరంగుల
మించెడు నొకశిశువుఁజూచి ♦ మెచ్చుచు నియతిన్.

ఉ॥ పావనమయ్యెనాజనియ ♦ పారకృపానిధిసన్ముఖుండు భ
క్తావనతత్పరుండ నెడు ♦ నార్యుల పల్కు యథార్థమయ్యె సం
భావితమయ్యె మత్కులము ♦ ప్రాజ్ఞుల దీవెనలున్ ఫలించెనో
రావిధికృత్యముల్ తెలియ ♦ రావుగదా యెటువంటివారికిన్.

క॥ మనవిన్నయట్టి సడియీ
తనయాకృతరోదనంబె । తప్పకయగు భూ
తనియంత కార్తికేయుం

డనుకంపనొసంగె మాకు । కాభీష్టంబుల్.

ఉ॥ తారకగర్వభంజనుఁడు • దారకృపాంబుధియైన దేవసే
నారమణుండు స్వాశ్రితజ । నంబుఁ గురించి యుపేక్షఁబూని మొ
ట్టూరకయుండు తత్పదప । యోరుహముల్ భజియించినంత బృం
దారకసంచయఁ బరివ । ధంబున ధన్యతఁగాంచి రెంతయున్.

క॥ రక్షింపుమనుచు వేడిన
నక్షయకృపఁ బ్రోచు వేల్పు । యనయము సేవ్యుం
డీక్షితినతఁ డొక్కఁడె పా
పక్షయకారకుఁడటంచు । భావింపఁదగున్.

తే॥ చెప్పనైతి మున్న । చెవియొగ్గి వినుమప
త్యంబులేనిచింత । నఖిల జగము
లేలియున్నయయ్యె । లేనివాఁడనయితి
నిన్నినాళ్ళు బ్రతికి । యున్నఁగాని

క॥ వేటనెపంబున నన్నీ
చోటికిఁ గొనివచ్చి యీశ । సూనుఁడు నాయా
రాటము మాన్పఁదలఁచి గుణ
పేటికనీతనయ నిడియెఁ । బెంచెద దీనిన్.

చ॥ అమృతమయంబులౌర మృదు । లాంగకముల్ వదనంబుచంద్రబిం
బము దయనీయ యిట్టిపసి । పాపనుగాంచి త్యజించు వారధ
ర్మము నొనరించినారనఁగ । రా దుపకారమె చేసి నాదు వం
శము నిలఁబెట్టినారనుచు । స్వాంతమునన్ ముదమొందఁగాదగున్

ఉ॥ ఈపసిబిడ్డఁ బెంతునని । యిప్పుడ కైకొనిపోవు టర్హమో
తాపసులో యెవారొ తలి । దండ్రులు వచ్చి సుతార్థమైమన
స్తాపము నొంది నాకునయి । శాప మొసంగుదురంచు భీతిమై
యీపెను కానలో విడిచియేగుట యర్హమొ తోఁచదింతయున్

తే॥ స్వల్పకార్యమైన । స్వవిషయమైనన ప్పు
డెట్టి బుద్ధిమంతుఁ । డేని ధైర్య
మూన నేరఁడనెడి । సూక్తి నిజంబయ్యె

నిపుడు నాయెడల న । హీనచరిత.

చ॥ అడిగెదనుత్తరంబిడఁగ । దయ్య కృతార్థుఁడనౌదు నిప్పుడీ
యడవిని వచ్చినట్లు చను । మందువొ బాలిక నొంటిపీడితే
కడరకపత్యభావమున । నాదరమూని గ్రహింపుమంచు నే
ర్పడవచియింతువో సుగుణ । రాజివిరాజిత బుద్ధివైభవా.

వ॥ అని ధనురాస్యుండు బాలికాగ్రహణసంశయడోలాయమానమానసుండై బహువిధంబుల విచారించుచుఁ దత్కాలోచితకార్యంబు నిశ్చయింప నేరక కొండొకతడవు నిమీలితలోచనుండై యెట్టకేలకుఁ దలపంకించుచు మరల నిట్లనియె.

చ॥ కరుణాశాలి యుమాసుతుం డఖిలర । క్షశ్శ్రేణిఁ బోకార్చిని
ర్జరలోకంబును బ్రోచినాఁడనుచు వి । శ్వాసంబు సంధించి సు
స్థిరచిత్తంబున నిష్టదైవతముగా । సేవింతు సల్లాటని
ష్కారణన్ నన్నుఁ గృతార్థుఁ జేయఁ దలఁచెన్ । గాఁబోలు నీనాటికిన్

మ॥ అనుమానింపఁగనేల యీతనయ ఘో । రారణ్యమందుంచి వేఁ
జనఁగా నేమిటి కాత్మజన్ బలెనువా । త్సల్యంబునన్ బెంచుకొం
దును మావంగసమెల్ల ధన్యముగ నన్ । దుండే యొసంగెన్ శ్రితా
వనదక్షుండతనిన్ భజింపసుఖముల్ । ప్రాప్తించకున్నే యిలన్.

తే॥ అనుచు నబ్బాలఁ గైకొని । వ్యాధనృపతి
భళిర నాజన్మము ఫలించు ♦ పగిది దీనిఁ
గార్తికేయుండె సృష్టించెఁ । గాకయున్నఁ
గలుగునేయిట్లు దివ్యల ♦ క్షణములెందు.

క॥ అనపత్యుండనగుటనా
జనివ్యర్థంబయ్యెనని వి ♦ చారంబున నెం
దును సంతసం బొకించుక
యును లేమినివగచుచుంటి ♦ నుర్వికిభరమై.

ఉ॥ ధన్యుఁడనైతి నిప్పటికి । ధాతయు నన్ను సృజించి నేటికిన్
ధన్యుఁడెయయ్యె నాతని వి ♦ ధానము సైతము ధన్యమయ్యె న
న్యోన్యసుహృత్త్వమూనికమ ♦ లాలయయున్ బిలుకున్ వెలందియున్

ధన్యులెవ్వరైరి నాయెడన । తంబువసించుటఁజేసి యివ్విధిన్.

వ॥ అట్లు దలంచుచు ధనురాస్యుండు కౌతుకాబ్ధి వీచికల నూగుచు ధన్యుఁడనని యెంచుచు నిశ్చలభక్తిఁ బరమేశ్వరారాధన మొనర్చించు మహామతుల మనోరథంబులు సమకూరుట నిక్కంబయని నిశ్చయించుచు నబ్బాలికామణి నిజతపఃఫలంబని యుబ్బుచు సైన్యంబుతోడ నిజనగరంబునకరిగి.

చ॥ అలికులవేణి యోతుకఁ జివు । రాకులఁబోని వెలుంగు కేలుఁద
మ్ముల నునుజాళువాకడియ । ముల్ ఘలుఘల్లుమటంచు మ్రోవఁగా
నలలిత తాళవృంతము వె । సన్ గొని వీచుచు నుపల్లాపముల్
బలుకుచు భావికార్యఫల ♦ పద్ధతులన్ దెలియంగఁజేయఁగన్.

చ॥ సుకృతమెగాక యిట్టిశుభ ♦ సూచకముల్ పొడసూపునే వృథా
సకలజగన్నియంతశర ♦ జన్ముఁడు మీయిలువేలుపౌటభా
వుకములకున్ నిదానము వి ♦ భూతిసమృద్ధికిఁ గారణంబటం
చోకమలాయతాంబకమ్మ । దూక్తుల మెల్లనఁబల్కుచుండఁగన్

చ॥ తనువు వడంకు సుంతయును ధైర్యము నిల్వదు మేను స్విన్నమౌఁ
గనఁబడదేమియున్ గనులు ♦ గల్గియు నర్థములేని పల్కులే
మొనయు శుభంబు గల్గుటకు । ముందుగ సీశకునంబు నట్టిదే
యని యొకప్రౌఢకామిని ప్రి ♦ యంబు చెలంగ వచించుచుండగన్

శా॥ కావచ్చున్ మిముబోంటి మానినులవా ♦ క్యంబుల్ వృథాపోవునే
దైవజ్ఞుల్ వచియించుచుందురు నిమి ♦ త్తంబుల్ ఫలంబిచ్చునం
చీవేళన్ శరజన్ముఁడే ఫలముమా ♦ కీయంగనున్నాఁడో యే
లావిశ్వాసము నిల్చునో తెలియదా ♦ వంతేనియున్ నెమ్మదిన్.

క॥ అనుచున్ గంభీరంబుగ
ననుఁగుఁ జెలులఁ గాంచి పల్కు ♦ నంబుజవదనా
జనమణియగు దేవేరిన్
గనుఁగొని వచియించెవ్యాధ ♦ కాంతుఁడు నెమ్మిన్.

క॥ ఫలమిదె తెచ్చితిఁగొనుమా
జలరుహలోచన సమస్త ♦ జగదాధారుం

డలఘుఁడు స్కందుండు కృపా
కలితుండై యొసఁగెనాకుఁ ♦ గానసీమన్.

తే॥ అనుచు నబ్బాలికామణి ♦ నతివకిడిన
నాపురంధ్రీమతల్లి హ । స్తాంబుజములఁ
బూనిముప్పిరిఁగొను మోద ♦ ముమెయిభద్ర
బాష్పములు ముత్తియంబుల । పగిదిఁగురియ.

మ॥ అనఘా నీవచియించునట్టి పలుకే ♦ లాతిత్రయానంబికా
తనయుం డక్కటికంబుఁదాల్చిన నసా । ధ్యంబైన కర్జంబుగ
ల్గునే లోకత్రయి నమ్మహాత్మునకు భ । క్తుల్ బిడ్డలట్లేగదా
యనయంబాశ్రిత రక్షణంబతని కా♦ర్యంబౌఁగదా చూడఁగన్..

చ॥ అనుకొనుచుంటి నిప్పుడె మ । హాత్ముల వాక్యము బీరువోదటం
చనఘమునై శివార్చన శు ♦ భాస్పదమానసుచున్ నిమిత్తముల్
గొనఁగొని యహర్నవా ఫలముఁ♦గూర్చునటంచటులే పొసంగెనా
జననము సార్థకంబగుచు ♦ సన్నుతిపాత్రమెయయ్యె నేటికిన్.

తే॥ అని యనేక విధంబుల ♦ వ్యాధకాంత
వినయమును గౌతుకంబును । బెనఁగొనంగఁ
బలికి పతియాజ్ఞఁబూని య ♦ బ్బాలికఁ గొని
యంతిపురమున కేగె ని । శ్చింతతోడ.

వ॥ అని పలికిన నలరి నైమిశీయులు తదనంతర కథాభాగంబు వక్కాణింపుమని యడిగిన సూతుండు క్రమ్మర నిట్లనియె.

## ఆశ్వాసాంతము.

క॥ నిర్మలకీర్తినిధీ స
త్కర్మాచరణైకదక్ష ♦ గణకాధ్యక్షా
దుర్మఖలోకవిపక్షా
ధర్మాద్రిసమానవక్ష ♦ ప్రణుతత్ర్యక్షా.

సీ॥ ఏమహానుభావుఁడు శ్రీ * వేమనారాధ్యవం
శాబ్ధిఁ బూర్ణశశాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి * కెనయై బుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య * మహిమఁ గాంచె
నట్టినందనుకు గౌరమకు ద్వితీయ పు
త్రుండఁ గౌండిన్య గోత్రుండ దక్షి
ణామూర్తికిని శివా * నందునకును సోద
రుండ గూరిమి యగ్రజుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మదీయమయి యలరు
నట్టి వల్లీపరిణయ కా * వ్యంబునందు
నమలమగు ద్వితీయాశ్వాస * మయ్యె దీని
సతతము రక్షించుఁగావుత * చంద్రమౌళి.

శ్రీ శ్రీ శ్రీ శ్రీ శ్రీ



శ్రీశివాయనమః.

# వల్లీపరిణయము.

## తృతీయాశ్వాసము.

క॥ లలితయశఃపరివృత ది
గ్వలయా వల్లీపరిణయ । కావ్యకథామం
జులమధురరస్వాదన
విలసిత శుభచరిత కృష్ణ । వేణీతనయా.

తే॥ అవధరింపుము వ్యాసము । ఖాంబురాశి
భవదమృతపూర నఖిలభూ । పాలమకుట
రత్ననీరాజితను కవి । ప్రకరజీవి
కయగు వల్లీపరిణయమ్ । కథను వేడ్క.

ఉ॥ ఆవిధి వ్యాధకాంత హృద । యంబు కరంబుకు తూహలాన్వితం
బై విశదంబు గాఁగ శబ । రాధిపదత్తకుమారికాప్తికిన్
భావనమయ్యె నాత్మజని । వ్యాధకులంబు తరించె బంధుసం
భావనమయ్యె నింకఁ బితృ । వర్గము సద్గతినొందు నెంతయున్.

క॥ అనుచుఁ దలంచుచు నెమ్మదిఁ
గనికరమును గారవంబు । గడలు కొనంగన్
దనప్రాణమట్టు లాశిశు
వును బెంచుచునుండె బంధు । వులు పేర్మిఁగనన్.

వ॥ ధనురాస్యుండును నబ్బాలికామణిలవలీసరస్తీరంబున లభించుట జేసి లవలియనియుఁ గాంచనవల్లివోలె మనోహరాంగియగు కతన వల్లియనియు నామకరణంబులు గావించి పెంచుచుండె నంతనబ్బాలికామతల్లి.

తే॥ శుక్లపక్షచంద్రికవోలెఁ జూడఁగదగి
యుచితదోహదావాప్తిఁ జె । న్నొందు లేత

తీవెచందాన హృద్యమై । దినదినంబు
పురుడు లేనట్టి సొంపునఁ ♦ బెరుగుచుండె.

తే॥ సరసజంబూఫలప్రాప్తి । సంతసించు
కొదమరాచిలుకపలుకుల ♦ కును లభించ
నట్టి మాధుర్యము వహించి ♦ హాళిఁగూర్చు
చిన్నిపలుకుల నేర్చె నా । చిరుతబాల.

చ॥ తనజనకుండహింసయె ప్ర ♦ ధానముగాఁ జరియించు సత్తపో
ధనుఁడగుటన్ దదీయమగు । ధర్మవుఁబూని పిపీలికాదిజం
తు నికరమించుకేనియును । నొవ్వఁగరాదని యాత్మనెంచెనో
యన మెలమెల్లఁగుడ్యముల । నంటుచు నంఘ్రులమెట్టుభూమి౯

తే॥ తననన న్యగతిక । యనిజాలిఁదలఁపక
విడిచిపోయెనట్టి । విపినభూమి
జనని తెలిపిలేక । యగి యబ్బురముఁ జెందు
నాఁగఁ జిన్ననవ్వు । నవ్వుబాల.

తే॥ క్రమసహకారపల్లవ ♦ గౌరవంబు
వెలితిపడఁజేయు చిన్నిచే । తులను సాచి
యెత్తుకొనుమంచుఁ బరుగిడి ♦ యింత నిలుచు
జనని యానందవార్నిధి । మునుఁగునటుల.

ఉ॥ కానక కన్నసంతగుట । గన్నుల నద్దుచుఁ బ్రాణసంచయుం
బేరియు లెక్కసేయక య ♦ హీనచరిత్రుఁడు వ్యాధకాంతుఁడ
మానవతీలలామ యస । మానగుణాన్వితవ్యాధకాంతయున్
బూనికఁ బెంపఁ జంద్రకళ । పోల్కిఁ దనర్చెను వల్లియెంతయు

వ॥ ఇట్లా వల్లికన్య యనన్య సామాన్యరూపరేఖావిలాసంబుల జ
జనకుల కానందంబుఁ గూర్చుచు నల్లారు ముద్దుగఁ బెరుగ
విద్యాభ్యాసోచిత వయస్కయైన తను రాస్యోందు.

తే॥ ఎట్టిగుణవంతుఁడును తగి ♦ నట్టి యొజ్జ
పజ్జఁజదువకయున్న నే ♦ ర్పరియుఁగాఁడు
మానికము గౌరవార్హ మె । యైనఁగాని

సానఁబట్టక కలుగునే । చాయ మిగులఁ.

క॥ తనయాభివృద్ధిఁ గోరెడు
జనులకు వత్సలత మాన । నంబున నిడియెం
దును గఠినచిత్తుఁడుంబలె
నునికియె యర్హంబటంచు ♦ నుడువుదు రార్యుల్.

చ॥ ఎన్నివ్రతంబులో సలిపి ♦ యీనిసుగున్ గనినారమిట్టిలే
కన్నియ నొక్కవిద్యయని ♦ గాసిలఁ జేయఁగనేల యెంతయో
యున్నది చాలదే యనుచు । నూరకయుండుట యెన్నఁగాదు స
ర్వోన్నతిఁ గోరుమానవుల । కొయ్యనవిద్య గడించుటర్హమా.

సీ॥ కన్నులు గలిగియుఁ । గానఁగలేఁడు సుం
తయుఁ దన్నుఁ గనవచ్చు । నదులనెపుడు
వీనులుండియుఁగాని । వినిపించుకొనలేఁడు
పరులు వచించెడి । పలుకులింత
సత్వసంయుతములౌ । చరణములుండియు
నిలువీడి కదలలేడింతయేని
యన్నిపదార్థంబు । లారగింపఁగవాయి
యున్నను బలుకఁబోఁ । డొరులతోడ
నంధుఁడున్ బలెఁ నొరులసా ♦ యంబుఁగోరు
ధనముగలవాఁడు వాని నూ । తఁబడఁద్రోయు
వేచుకొనియుందు రెంతయు । వింతవారు
రోగినిన్ బోలెఁ జుట్టును । మూఁగియెపుడు.

క॥ పరువంబధికారంబును
సిరి చదువమి యనెడునాల్గు । క్షితి నొకఁడొకఁడే
పొరిఁ జెట్టఁ గూర్చునా నివి
పరగిన నన్నియును జెప్ప । వలయునె వేరన్.

త॥ తనకువాత్సల్యమున్న నం । తయును దోఁచి
పెట్టఁదగుఁ జనువందగు ♦ నట్టిపట్ల
గఠినశాసనుఁడై యున్కి । కరము మేలు

కులముఁ బెంపొనరింపఁగఁ । గోరునేని

క॥ తనయుఁడు చదువక యుండిన
జనకుం డధమర్ణుఁ డైన । సతి చెడు గైనన్
మనసీయకున్న మిత్రుఁడు
మనుజునకు సుఖంబు లేదు । మహిలో నెపుడున్.

చ॥ పరహృదయం బెఱుంగు బుధ । పక్షముఁ దాల్చి చరించు గౌరవ
స్ఫురణ వహించు సద్యశముఁ । బొందు శ్రుతీరిత ధర్మమూని త్రి
మ్మరు పరివారలెల్లరును । మన్ననఁ జేయఁ జెలంగు శాస్త్రముల్
గరము పఠించెనేని మొన । కాఁడగు మానవుఁ డెల్లయందునన్.

క॥ ధనమదసంభూతంబగు
ఘనతిమిరం బెట్టిదీ । కాంతులనైనన్
జనదిల గురూపదేశం
బను రత్నచ్ఛాయ లేక । యరయఁగ నెందున్.

తే॥ కుంభగతదీపమట్లు ని । గూఢమగుచుఁ
దనయులందును జ్ఞానంబు । దాఁగియుండు
సదుపదేశంబునన్ జేసి । సరగ దాని
వెలువరించుట యహార్యమా । ర్యులకు నెపుడు.

క॥ కరిరాజమునకు శంఖా
భరణంబుల్ బోలె ధాత్రిఁ । బ్రాజ్ఞుల బోధల్
పురుషునకు వదనశోభల్
గరము గలుగఁజేయు నెల్ల । కాలంబరయన్.

తే॥ అక్షివిషయంబుగాని గో । ప్యమగు నెట్టి
యర్థమైనను దెలియంగ । నగును జ్ఞాన
నేత్రమున నక్కఁ తన విద్య । నేర్వఁదగును
విద్య నేర్వని జన్మంబు । వృథ ధరిత్రి.

చ॥ అరసి సమస్త । శాస్త్రముల నర్థమెయిన్ బఠియించి నట్టినే
ర్పరియును శారునింద్రియతు । రంగచయంబును గట్ట లేఁడనన్
దొరతనమూని కోవిదుల । తోఁ జరియింపక సంచరించువాఁ

డరపడకుండ నేర్చునె స । దభ్యసనంబు లభింపకుండినన్.

వ॥ కావున నిక్కన్యకారత్నము సహృదయుండగు నుపాధ్యాయునొద్దఁ జదివించుట యవశ్యంబు.

మ॥ ధనలుబ్ధుండును చంచలాత్ముఁడును వి । ద్యాహీనుఁడున్ క్రోధియున్
వనితాలోలుఁడు వ్యాధిబాధితుఁడు వి । ద్వద్వేషియున్ గర్వియున్
వినయాపేతుఁడు దుష్ప్రవర్తనుఁడు ను । ర్విన్ విద్య నేర్పంగఁ గూ
డని వారంచుఁ దలంచి ప్రాజ్ఞులిల వీ । డన్ జాతురవ్వారలన్.

తే॥ అనృతవాదియును బ । రాన్నభోక్తయుఁ గుటి
లుండుఁ గూటసాక్షి । దుండగీఁడు
కఠినచిత్తుఁడును వి । కర్ధనుండును గురు
త్వంబు నొందఁ దగని । వారు జగతి.

తే॥ పరులవంచించి జీవించు । పాలసుండు
పెరజనంబుల యభివృద్ధి । వినిసహింప
లేనివాఁడును సద్బుద్ధి । లేనివాఁడు
తగరుపాధ్యాయపదము నొం । దఁగ ధరిత్రి.

చ॥ చదివినవాఁడువోలెఁ బెలు । చన్ నటియించుచు నప్రతిష్ఠకున్
బెదరక ధర్మచింతయు వి । వేకము వీడి నిజోదరార్థమై
యిది యుచితంబునాక చరి । యించెడు లోభికి సర్వసంపదా
స్పదమగు బోధ సేయఁగల । పద్ధతి యెట్లుఁ గంగనోనిలన్.

క॥ తనవాఁడను నభిమానం
బునసజ్ఞుని సదుపదేశ । మును సేయంగన్
బనిపెట్టరాదు తనది
వ్వెనె ముద్దిడఁ గాలకున్న । వివరింపగన్.

తే॥ ఎచట పేరిమగల్గు । నచట సర్వజ్ఞత్వ
ముండు ననితలంచు । చుండు నరుఁడు
దిగినఁగాని లోతు । తెలియనేరదుగదా?
యెట్టిధీరుఁడైన । నింతయేని.

చ॥ తనకభిమానమున్నెడఁ బ • దంపడి యెంతయొ యీయవచ్చుగా

కనయము కీర్తిసౌఖ్యముల । కాస్పదమై యలరారు విద్యఁజె
ప్ప నిపుణుఁడంచు మూర్ఖునెడఁ । భావము నిల్పఁగరాదు ధారుణిన్
దనపొలమందుఁబుట్టెనని । తంగెడు మేయునె యెట్టివెట్టియున్.
తే॥ ఎద్దియేకారణంబున । నీద్యగుణుఁడు
తృణముగాఁగన్పడినవానిఁ । దెలిసియుహా
పదముఁ జేర్చుట యుచితమా । పద్ధతియగుఁ
బక్షపాతంబు కూడదె ప్పట్లనైన.
చ॥ తనువులనిత్యముల్ సుతులు । దారయు చుట్టలు సేవకుల్ ద్విష
జ్జనములు చూచుచుండఁగనెఁ । సంపదలెల్ల నశించుచుంటఁదాఁ
గనుచును యోగ్యమాపథము గానగలేకయయోగ్యయోగ్యుఁడం
చని యొకపక్షమూనఁ జను । నా బుధవర్యులకున్ దలంపఁగన్.
తే॥ స్వార్థపరుఁడుగాక । యనయంబు సద్గుణ
పక్షపాతమూని । పరులు స్వీయు
లనెడి భేదబుద్ధి । ననుసరింపనివాఁడె
శిష్యజనముఁ బెంపు । సేయనేర్చు.
చ॥ అలుగనివాఁడు శాంతుఁడు మ । హామతిమంతుఁడుసత్యవాది ని
ర్మలచరితుండరోగి బుధ । రంజనుఁ డుత్తమవంశసంభవుం
డలఘుకృపాన్వితుండు సుగు । ణాంచితుఁడర్థిజనావనుండు శా
స్త్రలలితమూర్తియౌ నతఁడె । ఛాత్రులకున్దయసేయువిద్యలన్
క॥ తనకన్నబిడ్డలన్ బలె
ననయము శిష్యజనులందు । నాదరమును బూ
నినవాఁడె సదుపదేశం
బొనరింపఁగ నర్హుఁడంచు । నదువుదురార్యుల్.
చ॥ తనకు శ్రమంబె యైనను ప । దంపడి యోర్చి పరోపకారముం
బొనరుపఁ జూచువాఁడు బరి । పూతచరిత్రుఁడు నిర్మలుండు ధ
ర్మనిరతచిత్తుఁ డీదృశుఁ డన । మానయశోవిభవాభరాముఁడౌ
ననఘుని జేరి శిష్యుఁడు ని । జాన్వయ వృద్ధి నొనర్చు నెంతయున్
క॥ పరమార్థమె ముఖ్యంబుగఁ

జరియించుచు సకలభూత । సంచయమున నీ
శ్వరుఁడుండునసుచుఁ దెలిసిన
గురునికడఁ జదువ సుగుణ । కోటిలభించుఁ.

వ॥ అని యనేకవిధంబుల సదసదుపాధ్యాయలక్షణంబుల నిరూపించి ధనురాస్యుండు రాజభక్తితత్పరుండును నభ్యస్తసకలవిద్యాచయుండును నిజపితృపరంపరాగతవిద్యాగురుండును నగు నొకవృద్ధవిప్రుని రావించి యర్ఘ్యపాద్యాదివిధులఁ బూజించి వినయవినమితగాత్రుండై సబహుమానంబుగా నిట్లనియె.

మ॥ అనఘా లోకగురుండవీవు భవదీయంబౌ కృపాదృష్టి నీ
ధనురాస్యుండు సమస్తవైభవము లొం । దంగల్గె వ్యాధాన్వయం
బున కాచార్యుఁడవీవకాదె యనిశంబుఁ నిన్ను సేవించి ధ
ర్మనియంతల్ ఘను లస్మదన్వయము వా । రల్ కీర్తి చేమించరే.

మ॥ చిరకాలంబు నిషాదపుంగవులు నిన్ ♦ సేవించి సౌభాగ్యవి
స్ఫురణంగాంచిరి మున్నుమాకులమునన్ ♦ సూరీంద్ర నీచెప్పు న
క్షరమే యక్షరమై యశోలతల ది । గ్వారంబునన్ బ్రాకఁజే
యు రహిన్ ద్వాదృశులైన యాప్తజనులెం♦దున్నారు మాకిద్ధరన్

క॥ ఈయుల్వుఁ డొక్కమానిసి
యై యలరుట తావకీన ♦ మగు కరుణన్ గా
దేయనఘుచిత్త నిర్మల
మై యెప్పుడు నీప్రభావ । మరయఁగ నెందున్.

క॥ స్కందవ్రతం బొనర్చుట
యిందుధరుని సేవజేయు ♦ టెల్లయెడల న
స్పందయశస్తుందిలది
గబ్బందుడనైయుంట తావ ♦ కేచ్ఛగాదే.

తే॥ మమ్ముఁగుఱిఁచినట్టి ♦ మంచిచెడ్డల కెల్ల
నీవయగుచు ధర్మ । నిపుణబుద్ధి
సంచరింతు వెపుడు ♦ సకలంబు నీయధీ
నంబె సల్పితిమి గు । ణాంబురాశి.

వ॥ అని పల్కి వల్లి నామహాభాగునకుఁ గాన్పించుచుఁ.

క॥ ఈకన్నియ హిమగిరితన
యాకాంతకృపాప్తి నాకు ♦ నాత్మజయగుటన్
మాకులము ధన్యమయ్యె ని
రాకులత వహించె డెంద ♦ మవనిసురేంద్రా.

తే॥ ఏను శిష్యుండనైనట్లె ♦ యీపె కూడ
శిష్యురాలగు మీకు నో ♦ క్షితిసురేశ
కనికరంబునఁ బుత్రి నే ♦ కరణి నింక
ధన్యురాలఁగఁ జేయుదో ♦ ధన్యచరిత.

వ॥ అని వచియించిన భూసురోత్తముఁ డాశబరపతిం గాంచి యిట్లనియె.

ఉ॥ అక్షయమోక్షదానచణుఁ♦డవ్యయమూర్తియు నైన యా విహా
పాక్షుఁడు మీకు సేవ్యుఁ డన ǀ యంబు తదీయకృపార్ధులైన మీ
కీక్షితి లోపమొండు కల ♦ దే గుణవృద్ధుఁడ వీవెఱుంగవే
దక్షమఖారిఁ గొల్చి విశ ♦ దంబగు కీర్తిన్ గడించు నంచొగిన్.

చ॥ వితతయశోవిశాలురు వి ǀ వేకధురీణులు విద్విషల్లతా
ప్రతతిలవిత్రకుల్ శబర ♦ రాజులు తావకవంశసంభవుల్
నతజనరక్షకుల్ ఘను ల ǀ నారతమున్ మము గౌరవంబుమై
హితులవలెన్ గనుంగొనియు♦యభీష్టములన్ బొనగూర్తు రెంతయున్

క॥ మీయాశ్రయంబు కతన న
మేయసుఖావాప్తిఁ గాంచి ǀ మృత్యుంజయసే
వాయత్త చిత్తులమగుచు
నీయెడ నివసించుచుండు ǀ మిద్ధచరిత్రా.

తే॥ మమ్ముఁ గాపాడునట్టి భా ǀ రమ్ము మీది
జగతి నాబాలగోపాల ǀ ముగను మీకు
విద్య గఱపుచు మీక్షేమ ǀ వృత్తములను
గోరుచుండుటయెల్ల మా ǀ భారమనఘ.

క॥ చదివించుట మాధర్మవు

చదువుట మీధర్మమై పో । సంగఁగ సుకృతా
స్పదమై యసదృశమగు నీ
హృదయంబున సంశయింప । నేటికిచెపుమా.

చ॥ ఇనుఁడు సహస్రహస్తముల । నేమరకెల్లతమంబు బాపున
య్యనలుఁడు సర్వభూతముల । కాశ్రయుఁడై ధనముంబొసంగు వా
హినులుస్వలాభముల్ విడిచియే । ప్రవహించుచునుండుఁ గావునన్
మనుజుఁడుస్వార్థముల్ విడిన । మానమతిన్ జరియింపఁగాఁదగున్.

తే॥ తనకు నుచితమైన । ధర్మవుఁ దప్పక
పరులకొఱకు పాటు । పడుట లెస్స
తనధనంబు విద్య । యును నర్హులగువారి
కొసఁగఁడేని నిరయ । మొందు నరుఁడు.

ఉ॥ ఈయఖిల ప్రపంచము గి । రీశ్వరు నంశమునన్ జనించుటన్
బాయక ప్రాజ్ఞులెల్లరుఁ గృ । పామయులై తగ భూతరాశికిన్
శ్రేయముఁ గూర్పనెంతు రటు । సేయఁ దలంపరయేని శూలికిన్
బాయనికిన్కఁ గూరిచిన । వారయి చింతలఁ గాంతురెప్పుడున్.

తే॥ ఎన్నిజన్మంబులందొ య । హీనబుద్ధి
సుకృతమొనరించినన్ గాక । సూరివరుఁడు
తగినశిష్యునియందు వి । ద్యాధనంబు
నునిచి ధన్యుఁడు గానేరఁ । డనఘచరిత.

క॥ తనసంపాదించినవి
ద్యను నిష్కపటాత్ముఁడగుచు । నర్హుండగు శి
ష్యున కుపదేశించనిచో
జనియించును మూఢుఁడగుచు । శబరాధిపతీ.

తే॥ మామకార్జితపుణ్యసంపదను జేసి
నీతనయశిష్యరత్నమై । నెగడియుంట
ధన్యమయ్యె నాజన్మవి । ద్యయు ఫలించె
కమలజుఁడు కృతకృత్యుఁడై । కరముమించె.

క॥ ఇన తేజ ముచితసమయం

బున నగ్నిం జేరి మెఱయు। పోల్కి గురుఁడు నే
ర్పినవిద్య శిష్యునిం జెం
దినఁగాని యశంబు నొందఁ। నేరదుధాత్రిన్.

తే॥ ఈమెయభివృద్ధిఁగాంచ నీ ♦ కెట్టికౌతు
కంబు కలుగునో నాకట్టి। కౌతుకంబె
కలుగుఁ గావున వేయుపల్కులను బల్క
నవసరంబేమి శబరకు। లాబ్ధిచంద్ర.

వ॥ అని యవ్విప్రపుంగవుండు నిరంతర కరుణారసార్ద్రహృదయుండై వల్లీపల్లవాధరి నిజయశోవృద్ధికరంబగు శిష్యరత్నంబని నిశ్చయించి యొకసుముహూర్తంబున బాహ్యోద్యాననిర్మిత విద్యాలయంబుఁజేర్చి విద్యగఱపుచుండె నంత.

తే॥ విమలమణి దర్పణంబున। విశదమగుచుఁ
బ్రతిఫలించెడు రీతి సర్వమగు శాస్త్ర
జాతమావల్లియందున। సంక్రమించె
స్వల్పకాలంబునందె య ♦ నల్పమగుచు.

సీ॥ ఒకనిముసమయేని ♦ యూరకుండకయహో
రాత్రముల్ జదువు శా ♦ స్త్రంబు లెల్లఁ
జదివి యందలి రహ। స్యంబు లెఱింగి య
న్యులకు బోధించు ని ♦ ర్మలినబుద్ధి
బోధించి తద్ధర్మ ♦ ముల ననుష్ఠించుచు
నొరులనుష్ఠించెడి। సరణి నల్పు
నలిపి స్వజన్మంబు। సఫలమయ్యెనటంచు
గౌతుకానుభవంబుఁ। గాంచి మించు
మించి గురుకటాక్ష। మే యిట్టి శ్రేయమోని
దానమనుచు గురుని। దైవముగను
గొలుచు వ్యాధకన్య। కోవిదు లెల్లరు
నబ్బురంబుఁ జెందు। నట్టి పగిది.

తే॥ గురుఁడు చెప్పిన పాఠముల్। కొదువ లేక

కరతలామలకంబులు గా గ్రహించు
జదివి యవ్వాన నొక్కయ క్షరము నైన
మరువ దావల్లిబుద్ధిసూ క్ష్మత యయారె.

తే॥ సారవత్తే త్రపతితబీ జంబు వోలె
వల్లి నేర్చిన శాస్త్రంబు లెల్ల విశ్వ
తోముఖములయి యలరె సం తోషవార్ధి
వీచికాటోవికల వ్యాధ విభుఁడు వెలయ.

తే॥ శుక్తిపుటమునఁ బడి శుద్ధ మౌక్తికత్వ
మును వహించిన యల స్వాతి చినుకులట్లు
లవలియెడసంక్రమించిన వివిధకళలు
వినుతిపాత్రంబులగుచును దనరె మిగుల.

క॥ రతనంబుకతనబంగరు
రతనముబంగారుకతన రాజిలునటులీ
సతికతమున విద్యలు నం
చితవిద్యలకతన సతియుఁ జెలఁగె ధరిత్రిన్.

శా॥ సర్వజ్ఞుండగు దేశికోత్తమునిప జ్జన్ జేరుటన్ జేసి వ్యా
ధోర్వీనాథునిపుత్రి గాంచె సకల ప్రోద్యత్కలాశాస్త్రముల్
గర్వోద్రిక్తుల రైనపండితులకె ల్లన్ భీతి వాటిల్లె నా
సర్వోన్నత్యము జెంది మించు లవలీ చంద్రాననన్ గాంచినన్.

చ॥ గురునితిరస్కరింపక ని గూఢములైనకళారహస్యముల్
నిరతి గ్రహించి నుంతయును నేమము వీడక నైజధర్మమే
మరక నిషాదకన్య యస మానమనీషఁ బఱించె నొజ్జయున్
గరము ప్రమోదచిత్తుఁడయి గౌరవముం బొనరింప నెంతయున్.

చ॥ అమలచరిత్రుఁ డాద్విజుకు లాగ్రణి నేర్చిననిద్యలెల్లను
త్తమమగుపాత్రమొందినప దార్థములుంబలె సార్థకంబులై
యమరుట కెంతయో కుతుక మంది కృతార్థుడనైతి నంచుఁ జి
త్తమునఁ దలంచెవల్లియును దద్దయుహర్షమునొందె నాత్మలో.

వ॥ మఱియు నాలవలీకన్య నిఖిలశాస్త్రజాతంబును గాంధర్వంబును

హస్తిశిక్షయు నశ్వహృదయంబును సమస్తకళలును నామువ్వే దంబును మంత్రప్రయోగోపసంహారంబులును విషాపహరణంబును కావ్యనాటకాలంకారంబులును బురాణేతిహాసంబులును సమగ్రంబుగ నేర్చి యనన్యసామాన్యపాండితీవిశేషంబున గురునంతవానినైనం బూరికిఁ గొనని కౌశల్యంబున నుండెనంత.

చ॥ ప్రకటితచారుకీర్తియయి । భాసిలు నాత్మజఁగాంచి న్యాధనా
యకుఁడుపవిత్రమయ్యెఁ గుల । మంచుఁగుతూహలమందఁడయ్యెన
య్యకుటిలచిత్తకన్నివిష ♦ యంబుల నీడగువాఁడు సంభవిం
చకునికి నాత్మకెంతటివి ♦ చారము కల్గునో యంచుఁజింతచే.

క॥ తనయాననావలోకన
మొనరించెడుదాక యెంత । యో చింతలము
న్గిన నాకానందములే
కినుమడి యయ్యెను విచార । మీమనవచ్చున్.

ఉ॥ ఎన్నితపంబులో సలుప । నీయమ పుత్రికగాలభించె నీ
కన్నియకింక నర్హుఁడగు ♦ కాంతుఁడునాకు లభించుటెట్లోయా
పన్నశరణ్యుఁడౌ హరుఁడ । పారకృపానహితాంతరంగుఁడై
నన్నుఁగృతార్థునిన్ సలుపు ♦ నా? పెనువంతలఁ గుందసేయునా?.

చ॥ సకలకళాప్రవీణయయి । శారదనానుతిఁ గన్నదాని శ్రీ
లకుఁబదమౌచు లిబ్బులపొ ♦ లంతియనన్ జెలువారుదాని నీ
యకలుషచిత్తనే ఘనున ♦ కర్పణజేసి తరింతునో నిషా
దకులము కీర్తిఁగాంచునొ ప ♦ దంపడిలోగునొ నాకతంబునన్.

తే॥ వేల్పుదలవాయి మాయిలు ♦ వేలుపగుటఁ
గనికరంబున నీయమఁ । గాంచఁజేసె
నతని సంకల్పముడివోవు । నాయతండె
యహుఁడగువానిఁ గూర్చుఁడా । యాదరమున.

వ॥ అనిధనురాస్యుఁడువల్లీపల్లవాధరకెల్ల విధంబుల దగినవల్లభుండేగతి లభించునోకో యని యనేకరీతుల విచారించుచుఁ బ్రపంచంబునన్ గలశబరాధిప కుమారుల నందఱఁ బరీక్షించియు నొక్కొక్కర

యందొక్కొక లోపంబేదియేని కలిగియుంటం జేసి ప్రయోజనంబు గానక తారకాసుర గర్వనిహంతయుఁ గ్రౌంచమదభేదియు భక్తవత్సలుండునగు షడాననుండె దిక్కుఁ గాఁగలఁడని హృదయంబునకు సమాధానంబుఁ గల్పించుకొని యుండునంత మఘమాసంబు సమీపించుటయు వార్షికంబగు స్కందోత్సవ మొనర్ప నుత్సహించి పురంబునం దెల్ల సాటంబంచి నంతఁ బౌరులు.

క॥ తిరునాళ్ళ దినములివి మం
దిరములిఁక నలంకరించి ♦ త్రిపురకవ్యాధే
శ్వరు మెప్పువడయఁగాఁదగు
శరజన్ముఁ డనుగ్రహించు ♦ సకలేప్సితముల్.

చ॥ కడచెనువత్సరం బిచట । స్కందమహోత్సవ మాచరించి యె
న్నఁడు మరలన్ బొనంగునొ పి । నాకిసుతోత్సవమంచు భక్తియే
ర్పడఁగుతుకంబునన్ జెలఁగు ♦ పౌరులకోరికఁ దీర్చినాఁడు నా
థుఁడు శటరేశ్వరుం డతని । తోరఁపుడెందము నెన్నశక్యమే.

క॥ కలియుగకైలాసంబన
నలరెడు నిప్పురముఁ గన్నె । లారఁ గనుఁగొనన్
వలెఁగాక చెప్పనలవియె
యలస్కందోత్సవము వేళ । నగు సంబరముల్.

తే॥ ఎట్టి సుకృతంబొనర్పక । యిప్పురంబు
జన్మభూమిగ సంభవిం । చదు ధరిత్రి
వరలు నేఁటట స్కందోత్స । వంబుఁ గాంచ
వేయుఁగన్నులు విలయువి । వేకమతికి.

చ॥ ఇనుఁడు సహస్రహస్తముల । నెంతయు శేఖరియై లిఖించుచో
ననఘుఁడు శేషుఁడానన స । హస్రమునన్ వచియించినన్ శ్రితా
వనుఁడగు కార్తికేయుని ప్ర । భావము సుంత కొంతగాదనన్
మనుజుఁడు శక్తుఁడౌనె యస । మాన మహోత్సవముల్ నుతింపఁగన్.

మ॥ ఘనబాహాబలదర్పితాఖిలరిపు । క్ష్మాపాలకోటీర ర
త్ననికాయార్చిత పాదపద్ముఁడగు వ్యా । ధస్వామిసంపూర్ణ భ

క్తినగాధీశకుమారికాతనయుఁడై । తేయాన్వయానూనకా
ననవహ్నిన్ బ్రతివత్సరంబుఁ గొలుచున్ । స్కందోత్సవాభిఖ్యచే

తే॥ అనుచుఁ బౌరులు కౌతుకం । బునఁ జెలంగి
లలితరీతి మందిరముల ♦ లంకరించి
యుచితవేషంబులన్ దాల్చి । యుత్సవంబుఁ
గనుటకెప్పుడో యనువేడ్క ♦ కడలుకొనఁగ.

వ॥ మేఘాగమనంబభిలషించు చాతకసమూహంబట్లు వేచియుండి రంత ధనురాస్యందు కార్తాంతికోక్తముహూర్తంబు చేరువగుటయు బంధుమిత్రామాత్యకళత్ర పుత్రికాయుతంబుగ నవసరచమూసంతానంబుఁగొని బాహ్యోద్యానంబున నలరు సౌధంబుఁ బ్రవేశించె నంతనక్కడ.

ఉ॥ తారకజిన్మహోత్సవవి । ధానముఁ గన్గొను వేడ్కవచ్చు భూ
దారులు విశ్రమింపనుచి । తంబుగఁ గట్టిన సౌధరాజియున్
సూరివరుల్ వసింపఁదగు । సుందరమందిరముల్ నిషాదధా
త్రీరమణాభిజాత్యమును । దెల్పక తెల్పెడు నద్భుతంబుగన్.

క॥ తురగముల హేషలునుబం
ధురతరకరిబృందఘీంకృ ♦ తులు మంగళవా
ద్యరవంబులు కలిసినభోం
తరభాగమునన్ బ్రతిస్వ । నంబు చెలంగన్.

సీ॥ గుమిగూడి యొక్కచోఁ । గోర్కెదైవాకజా
నపదులు హరుని గా ♦ నంబొనర్ప
గణికాజనం బొక్క ♦ కడనభినయకళా
కౌశలంబుఁ బ్రజకుఁ । గానిపింప
స్కందోత్సవంబిందుఁ ♦ గనుఁడనిచిత్రకా
రు లొకటఁ జిత్తరు । వులను జూపఁ
గోవిదు లొకవంక । గూఢంబులగునిగ
మార్థముల్ శ్రోతల । కర్థిఁ జెప్ప
వందిమాగధులొకవంక ♦ వ్యాధవిభుని

సద్యశోగీత వితతి ను ♦ త్సాహ మలరఁ
జనువఁజూపఁజూచువారికి ♦ సంతసంబు
వఱలఁజేసె నయ్యుద్యాన ♦ వనము మిగులఁ.

వ॥ అప్పుడు.

క॥ సురలు సుమవృష్టిఁగురిసిరి
సురదుందుభులెల్ల మ్రోసె ♦ సురకామినులున్
గరము ముదంబున నాడిరి
శరజన్మమహోత్సవంబు ♦ సాగెడు వేళన్.

క॥ లలితవిపంచీశ్రుతిసం
కలితంబై పంచమంబు ♦ గతివ్యక్తంబై
యలరెడు కంఠస్వనమున
బలుమరు శరజన్ముఁగుఱించి ♦ పాడుచు వేడ్కన్.

చ॥ హరగిరిజామనోమర పు ♦ రాంతకదీనశరణ్య పన్నగా
భరణ సమస్తభక్తజన ♦ పాలక బాలశశాంక శేఖరా
సరసిజసంభవాద్యమర ♦ సన్నుతపాదపయోజ మానిహ్రా
త్సర సిహాగ్రమందిర కృ ♦ శానురవీందువిలోచనా శివా!

మ॥ అనుచున్ బాడుచు నాడుచున్ సకలలో ♦ కానంద కృత్పంచమ
స్వనమూకీకృతకోకిలాళియయి ప్రాంచత్తంత్రులన్ మించు తి
న్నని వీణెన్ బలికించుచున్ విమలగాం ♦ ధర్వంబు మూర్తీభవిం
చెనో యే మోయనవెల్గువాఁ డొకమునిశ్రేష్ఠుండుపూతాత్ముఁడై.

క॥ అరుదెంచుటయును శబరే
శ్వరుఁడు వినతుఁడగుచు నహన్ ♦ సత్కారంబున్
బరగించి యుచితపీఠిన్
దిరముగఁ గూర్చుండఁజేసి ♦ స్థిరముగుభక్తిన్.

క॥ మునివర తావకదర్శన
మున ధన్యంబయ్యె వంశ ♦ ము పవిత్రుఁడనై
తిని పరసవేది సోకిన
నినుము సువర్ణమయి కాంచ ♦ దే గౌరవమున్.

క॥ ఊరకరారు భవాదృశు
లారయ నస్మాదృశుల గృ । హంబులకు జగ
త్కారణులు మీరు వచ్చుట
ప్రారబ్ధములెల్ల సఫల । మగుఁగాదె యిలన్.

చ॥ అనవుఁడు నారదుండు శబ । రాధిప యహర్నిశము గాదె మీకు ని
ట్లని వచియించు టొక్కయెడ । నైనను నిల్కడలేక యెల్లచో
ననయము సంచరించెదము మ । హాత్ములకున్ మిముబోంటివారలన్
గనుటయకాక వేరయొక । కార్యము గల్గునె ముజ్జగంబులన్.

తే॥ సత్యలోకము విడిచి కే । శవుని మ్రొక్క
రజతభూధరమున నుడు । రాజమౌళిఁ
గనులపండువు గాఁ జూడఁ । గాంచి యిటుల
వచ్చినాఁడను స్కందోత్స । వంబుఁ గనఁగ.

తే॥ ఎచట ధర్మముండు । నెచట దేవబ్రాహ్మ
ణోత్సవములు గల్గుచు । నుచితరీతి
నచలుఁ జేయుచుందు । నహర్నిశంబదియె సం
తసముఁ గూర్పు వ్యాధ । నాథనాకు.

చ॥ కనుఁగొనలేదు నీసలుపు । స్కందమహోత్సవమెన్నఁడేని నా
కనులకుఁ బండువయ్యె నన । ఘా యిపుడింతటి వైభవంబు నే
జనపతి యొనర్పఁడు ప్ర । శాంతము నీహృదయంబు నీకతం
బున శబరాన్వయంబు యశ । ముం గని శాశ్వతమయ్యె నిద్ధరన్.

తే॥ తను ధనంబులు జీర్ణించి । నను సహించి
పరుల కానందము ఘటింతు । ప్రాజ్ఞులవని
నొరుల సుఖదుఃఖములు తను । గొందు ననుచుఁ
దలఁపఁ డేనియుతఁడె దేవ । గలుషపదము.

క॥ న్యాయైకదృష్టిఁ బ్రజలకుఁ
బాయని సౌఖ్యమును గూర్చి । పరహితమునకై
కాయంబేనితృణంబుగఁ
జేయుట భూనాయకునకు । శ్రేయము నొసంగున్.

శా॥ సర్వజ్ఞుండవు నీవు నీయెడల వా । త్సల్యంబుఁ జూపించు నా
శర్వాణీప్రియవల్లభుండు సకల । ధర్మజ్ఞుల్ నీవనన్
గర్వంబున్ విడనాడి తావకకృపా । త్మశ్రీకిఁ గప్పంబుగా
సర్వస్వం బిడ నైనఁ జూతురట య । శ్రాంతంబు సుస్వాంతులై.

శా॥ ఈరాజ్యంబులు నీధనంబులును స్వా । మీ తావకీనోరు స
త్కారుణ్యంబునఁ గాదె కల్గెను జగ । త్కళ్యాణమున్ గూర్చ మీ
కీర్తిన్ వచియించు టహర్నిశం । బే సేయుదున్ ధర్మమున్
మీరల్ జూచెదు మర్త్యు లెప్పుడును ప్రా । ణిస్తుత్యులే చూడఁగన్.

క॥ అనపత్యుఁడ నగు నాకీ
వనితామణి తనయ యగుట । వంశంబున కెం
దును లేని కీర్తిఁ గూర్చుట
యనఘా మీ కనికరంబు । నన కాదె యిలన్.

చ॥ అమలినబుద్ధి మీ రహర । హంబుఁ జరించుచు నుందు రెల్లదే
శములను గంటిరే సకల । శాస్త్రవిదుండయి కోవిదానురూ
పమున మెలంగుచున్ గలుష । వర్తిపీడి నిజాన్వయంబు ధ
ర్మము నిలఁబెట్ట నేరిచిన । రాజకుమారకు నెందు గనియున్.

చ॥ అనవుడు దేవమౌని దర । హాసము మోమునఁ జెంగలింప నో
జనవర నీమనోరథము । చయ్యన నా కెఱుఁగంగ నయ్యె నీ
వనరుహనేత్ర కర్హుఁ డగు । వాఁడు చరాచరలోకజాలమున్
దనయుజచేత నిల్పఁ గల । ధన్యుఁడు సూర్యసమానశక్తిచే.

తే॥ లలిత శుకవాణి యీయబ । లాలలామ
బరిణయం బాడఁ దగినవా । డరయ నద్వి
తీయశక్తిధరుం డయి । తేజరిల్లు
యసముగలవాఁడు రాజమౌ । ళి సుతుఁ డధిప.

ఉ॥ నీసుకృతంబుకల్మిని జ । నించెను కల్లి సతీమతల్లి యీ
భాసుర కోమలాంగి చెయిఁ । బట్టుటకున్ దగువాఁడు దుష్టులన్
గాసిలఁ జేసి సజ్జనులఁ । గావఁగ నేర్చినవాఁడు దేవసే
నా సఖునంత వాఁడగు జ । నార్దనసన్నిభ వ్యాధవల్లభా.

మ॥ బలగర్వప్రభవిష్ణు తారక లసద్బాహుప్రతాపాటవీ
ప్రళయాభీలకృశానుఁడై నమదమర్త్యశ్రేణి కోటీర ని
ర్మల రత్నద్యుతి రాజితాంఘ్రియుగుచున్ ◆ రాణించు సేనాని మా
యలనా లోకలలామకున్ జెలువుఁడై లాలించు నశ్రాంతమున్.

తే॥ అనుచుఁ బల్కి నిలింపమహర్షి యరిగె
వ్యాధపతియును స్కందోత్సవంబవిఘ్న
ముగ సమాప్తి యగుట నిజనగరమునకుఁ
జనియె సంతసమున బంధుసహితుఁ డగుచు.

వ॥ అట్లుజని ధనురాస్యుండు నారద వచనవిశ్వాసంబున జగదీశుండగు షణ్ముఖుండు తనకల్లుం డగు నని యెంతయు నుబ్బుచు వల్లికతంబునఁ దనకులం బెల్ల ధన్యంబయ్యెనని యామెను మెచ్చుచు దేవబ్రాహ్మణారాధనంబును సత్ప్రతిష్ఠాలవాలంబులగు ధర్మకార్యంబులును గావించుచుఁ దన కిలువేలుపగు కార్తికేయుండె యిల్లటపల్లుఁడగుట సంభవింప నున్నందులకుఁ బూర్వజన్మార్జిత పుణ్యవిశేషంబె కారణంబుగ భావించుచు వివాహోచితప్రాయయగు పుత్రికారత్నము నవర్హుండగు మహాసేనునకిడి ధన్యుఁడు కాఁగల సమయం బెప్పుడో యని వేచి యుండె. లవలియుఁ దన శయనాగారంబునఁ జిత్రింపఁబడి యున్న స్కందవిగ్రహంబు ననేక విధంబుల భక్తియు గారవంబును ననురాగంబును రెట్టింప సేవించుచుండె నని పలికిన మహర్షు లవ్వలికథావిధానంబు గూడ నానతీయవే యని యడిగిన మరల సూతుఁ డిట్లనియె.

క॥ రసవత్కవి కావ్యనిబ
ద్ధ సదమల యశోభిరామ ◆ త్ర్యంబక విమలాం
ఘ్రి సమారాధన తత్పర
ప్రసవాయుధ సదృశరూప ◆ ప్రశమితతాపా.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ ♦ వేమనారాధ్య వం
శాబ్ధికిఁ బూర్ణ శ ♦ శాంకుఁడయ్యె
నేతల్లి సావిత్రి ♦ కేశయై బుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య ♦ మహిమఁ బూనె
నట్టి నందయకు గా ♦ రమకు ద్వితీయ పు
త్రుండఁ గౌండిన్య గో । త్రుండ దక్షి
ణామూర్తికిని శివా । నందునకు సోద
రుండఁ గూరిమి య । గ్రజుండ సుబ్బ
నార్యునకుఁ బా । త్రుఁ డను మదీయమయి యలరు
నట్టి వల్లీపరిణయ కా ♦ వ్యంబునందు
నమలమగు తృతీయా । శ్వాసమయ్యె దీని
సతము రక్షించుఁగావుతఁ ♦ జంద్రమౌళి.

శ్రీ శివాయనమః

# వల్లీ పరిణయము.

## చతుర్థాశ్వాసము.

క॥ శారద నీరద పారద
నారద నిభ కీర్తి యాది • నారాయణాసం
జ్ఞారాజిత సుగుణగణో
దారా గౌతమ సగోత్ర • తత్త్వవిచారా.

తే॥ అవధరింపుము శ్రవణేంద్రి । య ప్రవేశ
మాత్ర విగతాన్య హేతు సం । ప్రాప్త దుర్భ
రవ్యథను రసవత్కవి • ప్రకర జీవి
క యగు వల్లీపరిణయ మ • కథను వేడ్క.

వ॥ అఘటన ఘటనా సమర్థుఁడగు సుమనో మహర్షి యట్లు ధనురా
స్యుని వీడ్కొని వల్లీవృత్తాంతంబు గిరిజానందనున కెఱింగించు
నుత్సాహంబు పెంపున నరణ్యంబులఁ గడచి తనముందర.

ఉ॥ అంబరచుంబి శృంగనిచ • యంబయి సానుసరజ్ఝరీతరం
గాంబు కణాభిరామ మయి । యల్పసరో జలజ ధ్వనద్విరే
ఫం బయి దృశ్యమై యలరు । పర్వతముం బరిపూర్ణ సంజ్ఞకం
బుం బొడఁగాంచిసంతసముఁ•బొందెనమర్త్యమునీంద్రుఁడెంతయున్.

తే॥ పెన్నిధిని బొడఁ గాంచిన । పేద వోలె
నన్నగంబు దర్శించి మ • హర్షి వరుఁడు
కౌతుకము చెంగలింప న । ఖండ మగుచు
నాత్మజని ధన్యతమ మయ్యె । ననుచుఁ దలఁచి.

క॥ పరిపూర్ణ శుభాస్పద మిదె
పరిపూర్ణ నగేంద్ర మిట ని • వాస మొనర్చున్
బరిపూర్ణ దయామయుఁడగు
శరజన్ముఁడు భక్తలోక • సంరక్షణకై.

మ॥ కనవే నాయయ్యదె గోత్రభిత్ప్రముఖ లే । ఖాసంచయం బద్రిజా
తనయాలోకన కౌతుకంబు మెయి ను । ద్యద్రత్నహారంబులున్
వినుతానేకసువర్ణ భూషణములున్ । వేఁగొంచు నొక్కొక్కరే
చననుంకించుటయున్ మేయిపుడు క్రౌం । చధ్వంసి దర్శింపగన్.

క॥ చిరకాల మయ్యెఁ గరుణా
కరుఁడగు శరజన్ముఁ గాంచి । క్రతుభుక్పతిమం
దిరమునను దేవసేనా
పరిణయ మగునట్టి వేళ । భక్తిఁదలిర్పన్.

క॥ విదుషీమణి యగువల్లీ
సుదతికతన మరల నేఁడు । చూచెద మోక్ష
ప్రదుఁడగు షడాస్య సుకృతా
స్పద మయ్యెను మామకీన । జని పరికింపన్.

వ॥ అని సంతసంపడుచు నమ్మునిచంద్రుఁడు మెల్లమెల్లన నయ్యచలం
బధిరోహించి.

ఉ॥ అన్నగ శృంగ భాగమున । యందు లసన్మణి మందిరంబులో
నున్నత సింహపీఠి సుర । లూడిగముం బొనరించు చుండనా
పన్న శరణ్యుఁడై కలుష । పర్వతవజ్రమునై చెలంగు నా
పన్నగ భుక్తురంగుని కృ । పామయు స్కందుని గాంచెవేడ్కతో

వ॥ అట్లు గాంచి పరమానంద కందళిత హృదయారవిందుఁడై.

ఉ॥ కనుగొంటిన్ బరిదృశ్యమాన సకల । తూ్మచక్ర రక్షా కళా
వసధిన్ దుర్జయ దానవ ప్రకర శుం । భ ద్బాహు శౌర్యాగ్ని జీ
వనదున్ నిర్జర లోక వల్లభ సుతా । వాంఛా ప్రదున్ లోక పా
లనదక్షున్ గిరిజా ప్రియాత్మజుని లీలావిగ్రహున్ స్కందునిన్.

సీ॥ కనుసన్నలన్ బిల్చుఁ । గనికరంబున దర్శ
నార్థులై యరుదెంచు । నట్టి మునులఁ
దలయూఁచి రప్పించు । దానవ బాధావి
గహిత బృందారక । వ్రాతములను
దరహాసమునఁ గాంచు । సురకామినీ కృత

క్రమ నృత్యంబుల । గారవించి
చెవి యొగ్గి యాలించు । శ్రితజన ప్రార్థనల్
కరుణారసార్ద్రీ హృ । త్కమలుఁ డగుచు
నందికేశ్వరానీత పి । నాకపాణి
సముచితాశీస్సులకు । నమస్కారశతము
సలుపు లోకైక వీరుఁడౌ । షణ్ముఖుండు
ధన్యుఁడ నయితి నాతని । దర్శనమున.

క॥ అనుకంపాసహితుఁ డగుచుఁ
గనుఁగొను చున్నాఁ డెవండు । గతజన్మమునన్
ఘనతప మొనరించెనో య
య్యనఘుని కృప కర్హుఁ డగుట । కద్భుతమయ్యెన్.

వ॥ అని యనేకవిధంబులఁ దలంచుచు మెల్లమెల్లనఁ దారకాంతకుని డాయన్ జని.

చ॥ సకల చరాచరంబయిన । జంతుసమూహాము సృష్టిఁ జేయు బ్ర
హ్మకె ప్రణవార్థమున్ దెలిపి । మాన్యుఁడవైతి జగాముగండ తా
వక చరణాంబుజాతముల । భక్తి భజించెడివారి కెల్ల నీ
వ కద శరణ్యమో యమర । వైరి కులాంతక దీనరక్షకా!

క॥ సౌందర్యవిజిత మన్మథ
బృందారకశరణ దైత్య । పృతనాంతక సం
క్రందన తనయావల్లభ
వందన మిదె క్రౌంచగర్వ । వారణ దేవా!

తే॥ అనుచు సాష్టాంగ మెఱగిన । నమ్మహర్షి
తల్లజుని గాంచి కరుణార । సోల్లసిత మ
నస్కుఁ డగుచును బార్వతీ । నందనుండు
మృదుమధురవాక్ఫణితి బల్కె । నివ్విధమున.

తే॥ కుశలమే గద నీ కెట । కున్ జనంగఁ
దలఁచి యిటు చనుదెంచితో । ధన్యచరిత
చాలదినములు కడచె నీ । జాడ దెలసి

యెందు ద్రిమ్మరుచున్నాఁడ ॥ వింత తడవు.

క॥ నిరతం బోకచో నిలువక
చరియించుచు నుందు వెల్ల ॥ జగములయందో
పరమర్షి శ్రోత్రవిషయము
లరయుదు గా యేజగంబు ♦ నందించుకయున్.

క॥ కారణము లేక యెన్నఁడు
చేరవు మానిలయమున క ॥ శేషజనంబుల్
నీరాక కోరుదురు బృం
దారకముఖ్యుఁడవు నార ॥ దముని ప్రవరా.

తే॥ మాకుహితుఁడవు నీవు నీ ♦ రాక నుంత
తడవగున యేని తోఁచక ॥ తావకీన
మార్గమునె కనుచుందు మ ♦ మానుషప్ర
భావుఁడవు నీవు దేవర్షి ♦ వర్య యెపుడు.

చ॥ అనవుడు మాని భక్తివిన ॥ తాంగుఁడునై తగ భద్రభాష్పముల్
కనుగవ నాక్రమింపఁ గర ॥ కంజయుగంబు మొగిడ్చి దేవ నీ
కనికరమే కదా సకల ॥ కామ్యములన్ సమకూర్చు నట్టిచో
మునులకుఁ ద్వత్కృపాహర్షులకు ♦ మోదమె కాక కొఱంత కల్గునే

మ॥ అనఘా యెప్పటియట్ల యీశ్వర పద ॥ ధ్యానామృతాస్వాదనం
బున నుత్సాహము ముమ్మరింపఁగ మదిన్ ♦ భూలోకమందున్ జరిం
చి నిజస్థానముఁ జేరఁబోవుచు సునా ॥ శీరప్రతాపాఢ్యుఁ డా
ధనురాస్యుండను వ్యాధకాంతునొకనిన్ ♦ దర్శించితిన్ వేడ్కమై.

ఉ॥ ఆతఁడు శైవలోకమణి ♦ యై యనయంబు నయంబుఁబూని లో
కాతిశయాళువై భవము ॥ నందుచు నాత్మకులాహ్వధర్మమున్
జేతముఁ జేర్చి సద్గుణవి ॥ శిష్టుఁడునై భవదీయ పాదకం
జాతములన్ భజించు నర ॥ సంబగు వృత్తిఁ జరించు నెంతయున్.

తే॥ అతనికూఁతురు లావణ్య ♦ వతి సమస్త
సుగుణఖని సూరిలోక సం ॥ స్తుత చరిత్ర
వల్లినాఁ దగునది యన ॥ వద్యహృద్య

శాస్త్రసర్వస్వమన నొప్పు । చంద్రవదన.

ఉ॥ ఆరమణీలలామమను । జాంగనయై జనియించెఁ గాని బృం
దారకకాంతలందును గ । నంబడ దట్టి సమస్త సద్గుణా
ధార, విరించి పూన్కి-మెయి । దానిని సృష్టిఁ బొనర్పఁబోలు సా
ధారణసృష్టిగాదు వసు । ధాధర గర్వవిభేదనక్షమా.

ఉ॥ ఆసుగుణాలవాల తమ । కన్నివిధంబుల ధర్మపత్నియై
భాసిలుఁగాత మంచు విధి । వ్రాయుటయే నిజ మట్లుగానిచో
నీసకలప్రపంచమున । నెందును వల్లికి నర్హుఁ డన్యుఁడే
డీ సరసీరుహాసనుని । కృత్యము సార్థకమయ్యె నీయెడన్.

క॥ ఆవనజాననకుందగు
దీ వాచంద్రముఖి నీకు । నిల్లాలయి సం
భావింపఁ దగును లోకశు
భావహమగు మీ వివాహ । మార్తార్తిహరా.

వ॥ అని వచియించు నారదువచనంబుల సావధానంబుగ నాలకించి సేనాని కించిద్ధ్యాననిమీలితలోచనుండై శిరఃకంపంబుఁ గావించి తక్కుఁగలవారి యథాస్థానంబుల కరుగ ముదల యొసఁగి బ్రహ్మమానసపుత్త్రుఁడగు నమ్మునిపుంగవుఁ గాంచి దరహాసంబున నిట్లనియె.

శా॥ ఓవాచంయమివర్య నీపలుకు మా । కుత్సాహముం గూర్చె నేఁ
డే వల్లీసతి డాయఁబోయి భవదీ । యేష్టంబు సిద్ధింప రా
జీవాక్షిన్ సతిఁగా గ్రహింతును జగ । చ్ఛ్రేయంబు సంధింతు సం
భావింతున్ శబరాన్వయంబును మఱి । త్వన్నాథుఁ డుప్పొంగఁగన్.

క॥ అని పలికి కార్తికేయుం
డనుకంపాసహితుఁ డగుచు । వ్యాధాంగనకై
కొనియెడు నుత్సాహము నె
మ్మనమున ముమ్మరము గాఁగ । మంజులరీతిన్.

మ॥ ప్రతిపక్షోద్ధుర బాహువిక్రము తమో । భాస్వద్ధనుర్బాణ సం
తతితోఁ గోటిరతీశ సన్నిభుల స । ద్గాత్రంబుతో సంతతా

క్షితిరక్షాపటు బాహుదండములతో ♦ శ్రీమించు నెమ్మోముతోఁ
క్షితినాథోత్తముఁడై బయల్వెడలె నా ♦ సేనాని కాంతార్థియై.

తే॥ అతుల రాజవేష ♦ మవధరించి నిషాద
కన్యఁ గొనెడువేడ్క ♦ కడలుకొనఁగఁ
బార్వతీసుతుండు । పయనం బొనర్చె నొ
క్కండ భీకర మగు । కాననమున.

వ॥ అట్లు పయనంబొనర్చి కతిపయ ప్రయాణంబులఁ బరిపూర్ణపుర సమీపారణ్యంబుఁ జేరి యందొక్క క్రీడావనంబుఁ దర్శించి తన మనంబున.

తే॥ వివిధ క్రమలతా పరి । వేష్టితంబు
లంబమాన కుసుమగుచ్ఛ । లాలితంబు
సదమలం బల్లదియె నికుం ♦ జంబు దాన
నించుక వసించి చనియెద ♦ నింతికొఱకు.

తే॥ లలిత సహకారపల్లవం । బులను మెక్కి
కర్ణపేయంబుగాఁ గఁ బి । కం బొకండు
కూయుచున్నది తనజోటిఁ । గూడి యదియె
యీసుశకునంబు నాకు మే । లే యొసంగు.

తే॥ మీననేత్ర పంక । జానన యావర్త
నాభి ఫేనహాస । నవ్యహంస
యాన కొలఁకుపొలఁతి । యదె భృంగఝుంకార
మూలమునను నాకు । ముదముఁ గూర్చు.

చ॥ ఒకవిరహార్తహంసి యదె। యొయ్యన నాథునను గ్రహంబుఁ గో
రి కమలపత్రపాత్రమున। వ్రీడ యొకింత తొలంగఁ ద్రోసి పూ
నిక బిసఖండసంతతుల । నిల్పి ప్రియుం డిఁకనైన రాఁడదే
మొకొ యనికూయుచున్నయది। మోహము గెల్వఁగశక్యమే యిలన్.

చ॥ అలరెడు జాజిమొగ్గలను । నబ్రఁపు లేనగ వొప్పఁ జిల్కకూ
నల నునుపల్కులన్ మృదుని। నాద మెలర్ప వనాంగనాలలా
మ లలితపల్లవాంఘ్రుల న। మంచిత మియ్యెడ విశ్రమింపుమం

చెలిమిని నన్నుఁ బిల్చు నిది । యే కద యుత్తమధర్మమౌ నిలన్.

తే॥ అనుచుఁ దలఁచుచు నుత్సాహ । మున షడాస్యుఁ
డొక్కపొదరింటినడుమఁ గూ । ర్చుంచి వేడ్క
మెల్లమెల్లనఁ బవమాను । డుల్లమలర
నుపచరింపఁగఁ జూచుచు । నుండెనపుడు.

చ॥ అనిమిషమానివాక్యముల । యందలి గౌరవమే ప్రధాన సా
ధనముగఁ గామదేవుఁడె ని । దానముగాఁ బెలుచన్ దినక్రమం
బున నభివృద్ధిఁగాంచు నవ । మోహము చిత్తమునాక్రమింపఁగా
ననయము తారకాంతకుని । యందున లక్ష్యమునిల్పి యెంతయున్.

తే॥ అన్యకార్యాభిరతి విడ । నాడి మనసు
కార్తికేయునియందె ల । గ్నం బొనర్చి
యతని కృపయెప్డు కలుగునో । యనుచు వేచి
యున్న లవలీలతాంగి తా । నుబుసుపోక.

క॥ అనుకూలవతియగుచుఁ దన
మనమున వర్తించు నొక్క । మానినితోడన్
జనుదెంచెను క్రీడావన
మున విహరింపంగఁ గోరి । ముదమెసలారన్.

తే॥ అటులఁ జనుదెంచి వల్లిల । తాంగి సంత
సంబు దైవార నచటఁ గాం । చనలతికలఁ
దరుణసహకారములను బం । కరుహములను
గనుగొనుచు విహరించుచుం । డెను చెలంగి.

చ॥ అమలమనస్కయైన చెలి । యాసతిఁ గన్గొని నర్మగర్భవా
క్యముల వచించు నిట్లు వని । తా కను మివ్వనలక్ష్మి ముగ్ధయై
భ్రమదలినీలవేణి యయి । బంధురగుచ్ఛనతాంగయై సరో
జమృదుపదాఢ్యయై యల వసంతసమాగమకాంక్ష నొప్పెడున్.

క॥ కనుమదియె చంద్రముఖి కాం
చనవల్లిక తనకు నుచిత । సహకారాలం
బనము లభింపమిఁ బొడమెడి

వనటకతన నేమొ చపల । భావము జూపున్.

తే॥ బందిగురివెందతీవెచ । ప్పరమునందుఁ
దనమనోహరుఁ గూడియెం • తయు ముదమునఁ
దీవెయూయల నూఁగెడి । పావురంబుఁ
గంటివే జలజానన • కన్నులలర.

క॥ మదనోద్దీపక మివ్వనిఁ
కెద భయపడ కేలవచ్చి • తీవని కలికా
రదనయగు కుందలత యదె
సుదతీ నిను నవ్వునట్లు • చూడంగఁదగున్.

చ॥ అనవుడువల్లి దానిఁగని • యానవు మాటలు పెక్కునేర్తువే
వినుచు సహింపవచ్చునె వి • వేకవతీమణి వైన కన్నెకీ
వను పరిహాసవాక్యము ల • యారె యెఱుంగవొ ప్రోత్తదానవే
తనువులె వేరుగాని మన । తత్వము వేరగునా తలంపఁగన్.

వ॥ అనిన నెచ్చెలి దరహాసంబు భాసురంబుగా నిట్లనియె.

చ॥ కనలకు మమ్మ నన్ను నవ । కంజవిలోచన రాజబాభరం
బునకు ముదంబుఁగూర్చు తలఁ•పుంగొనియల్లదెభృంగి యోర్తుపూ
చిన యొకమల్లెతీవెకడఁ । జేరి మరందముఁగ్రోలి ఝుంకృతి
ధ్వని యొనరించుచున్నయది । ప్రౌఢగదా కనుగొమ్ము మెల్లనన్

చ॥ అనవిని వల్లి యిట్లనియె । నల్లదె కాంచితె కీరరాజమున్
దనప్రియురాలి చేష్టలను • దద్దయుఁ గన్గొనువేడ్క మోహమున్
బెనువలయందుఁ జిక్కుకొని • పేశలపర్ణపుటాంతరాళమున్
మనకిఁగఁ జూచుచున్నయది । మారునిశక్తి యనల్పమౌఁగదా.

తే॥ అనుచుఁ బలువిధముల । నన్యోన్యముగ మాట
లాడుకొనుచు వికసి । తాంబుజములఁ
గుందగోరకముల । గోరంటపువ్వులఁ
ద్రుంచుచుండి రంతఁ • గ్రౌంచభేది.

తే॥ మనసు నిలుపలేక । మానినీలావణ్యా
మునకు వశ్యుఁడగుచు । ముప్పిరిగొను

కౌతుకమున శబర ♦ కాంత నెంతయుఁ గను
లారఁ గనియుఁ దనివి ♦ తీరకునికి.

మ॥ అళినీలాలక కన్నుదోయి యనురాగాపూర్ణమై శాంతమై
వలపున్ గూర్చు మనోజబాణమయి తీవ్రంబై మనోవేదనన్
గలిగించున్ విపరీతధర్మముల కేకస్థానమున్ గూర్చినాఁ
డలఘుం డంగభవుండు తన్మహిమ మేలా చెప్ప శక్యంబగున్.

చ॥ వెలఁదులమిన్న నెన్నడుము ♦ విష్ణుపదంబు కుచద్వయంబు ని
ర్మలమగు నీశ్వరాలయము ♦ బ్రహ్మపదంబు ముఖంబు కొప్పురా
జిలు సుమనఃపదంబు సర ♦ సీరుహలోచన సర్వదేవతా
వళిని భజించు పుణ్యము న♦పార మొసంగదె తన్నుఁ గొల్చినన్.

ఉ॥ అంగనవాడిచూపుల స ♦ హాయమునన్ మదనుండు లోకమె
ల్లం గెలువంగ నేర్చి తన ♦ లావె యటంచుఁ దలంచి యాత్మను
ప్పొంగు ననంగుఁ డాతఁడొక ♦ పూరుషుఁడే మధువాని పోలు నా
భృంగచయంబు యోధతతి ♦ యే కుసుమంబులు వాడికోలలే.

చ॥ పొలఁతుక మోముఁదమ్మిపయి ♦ మూఁగి మరందము నానుపూన్కిమై
నళులు ధ్వనించి గంధఫలి ♦ యన్ భ్రమ నాశికఁ గాంచి భీతిచే
నల రేదు వేణిఁ జేరి యట ♦ నన్నియు సంపఁగి మొగ్గ లౌట నెం
జిలిఁగొని పారుచున్నవవె ♦ చేడియసోయగ మెంచశక్యమే.

ఉ॥ శారదచంద్రచంద్రికల ♦ సౌరు హసించెడి లేతనవ్వు పొ
ల్పారెడు మోముఁదమ్మికొక ♦ యబ్బురఁపున్ జిగిఁగూర్ప నెచ్చెలిన్
జేరి సుధాసఖంబులగు ♦ నెయ్యఁపుఁ బల్కులఁ బల్కుచున్న దా
రా రుచిరాంగితోఁ జెలిమి ♦ యబ్బిన ధన్యుఁడఁ గాక యుందునే.

తే॥ తనయొనర్చిన లోపముల్ ♦ దలఁచి తలఁచి
వాని దిద్దుకొనన్ గోరి పద్మయోని
యుత్తమద్రవ్యములఁ గూర్చి ♦ తత్తరపడ
కంగనామణి సృష్టిసే ♦ యంగఁ బోలు.

చ॥ తరుణిగురించి దేవముని ♦ తల్లజుఁ డాడినపల్కులెల్ల ద
బ్బరలనుకొంటిఁగానిమెల ♦ ప్రాయపుఁ గన్నియుఁగూర్చి చెప్పగా

గరమసమర్ధుఁడయ్యె ముని । కాంతుఁ డటంచును దోఁచె నిప్పుడీ
సరసిరుహాక్షిఁ గైకొనుట • సర్వవిధంబుల నాకు శ్రేయమా.

చ॥ జలరుహచారునేత్ర తన । చక్కఁదనంబు ను పాయనంబు గా
నలిపి యుదారభావము ప్ర • శస్తముగా ముదముం బొనర్చె. నీ
చిలుకలకొల్కికిన్ బదులు । సేయుట ధర్మము గాన మత్తనూ
విలసనముం గనుంగొని య • భీష్టము నొందెడుఁగాత కాంతయున్.

వ॥ అని తలంచి మహాసేనుం డప్పరాగోహకుఁ దన్నుఁ గనంబరచు వాఁడై యొకచేఁ గోదండమును మరొకచే నిశితంబగు బాణంబును దనయోధాగ్రేసరత్వంబుఁ బ్రకటింప నన్నికుంజంబు వెలువడి వారిన్ దరిసి యిట్లనియె.

చ॥ కువలయనేత్రలార కను । గొంటి రెభద్రగజం బొకండు శా
త్రవగహనాగ్నినై కరము । రాజిలు మామకబాణసంతతిన్
దవిలి సహింపలేక విపి । నంబునఁ బారుచు నీపథంబునన్.
జవమున వచ్చె నాగజము • జాడ నెఱుంగుదు రేని తెల్పరే.

క॥ అని వేదండవ్యాజం
బునఁ గుహనాభూమిపాల । పుత్రుండగుచున్
జనుదెంచిన శరవణభవుఁ
గని వనితలు సంభ్రమంబు । కడలుకొనంగన్.

క॥ సుడిగాలితాకునన్ ద
ల్లడఁపడియెడిలేత తీవె । ల విధంబున న
ప్పుడు కరము కంపమొందిరి
పుడమిపతుల రాక భయము । పుట్టించుఁ గదా.

వ॥ సహజగాంభీర్యాది సద్గుణాలంకృతయగు వల్లీదేవి యొక పోక ద్రమాకుచాటునఁ జేరె నంతనా మెచెలి యా పురుషోత్తమునిఁ గాంచి యిట్లనియె.

ఉ॥ స్వైరవిహారలోలలగు । చంద్రముఖీమణు లున్నచోటికి
తీరున రాఁబనేమి యిది । ద్వీపులకున్ జరియించుతావె శృం
గారవనంబు ఘోరవనిగాఁ గనుపట్టెనె పూవుఁదీవెలన్

గీరములన్ బికంబులను ♦ గేకులఁ గాంచి యెఱుంగనైతివే.
క॥ అంతఃపురవాసినులగు
కాంతల నిటు బల్కరింపఁ । గాగజమిషచేఁ
బంతమున వచ్చితివి భూ
కాంతుఁడు మాతేఁడు వినిన । గనలునుగాదే.
వ॥ అని నర్మగర్భంబుగ వచించి వివేకవతియగు నక్కాంత వ
నిట్లనియె.
తే॥ ఉర్వినాథ తావ । కోద్దేశ మేమైన
నగును గాక మాకు । నతిథివైతి
విచట విశ్రమించి । యివెరసాలఫలంబు
లారగించి పోఁగ । దయ్య యిపుడు.
తే॥ అనుచు వినయంబు దోఁచుకాడ । నబ్జవదన
యామ్రఫలఖండములు మంచి । యరఁటిపండ్లు
గోస్తనీరసము నొసంగఁ । గొని నృపాల
వర్యుఁ డట్లని పల్కె న । వ్వనితతోడ
చ॥ జలజదళాక్షి మీసుగుణ । సంపద యేరికిఁ గల్గు తేనియల్
జిలికెడి నీమృదూక్తులకుఁ । జెందితి సంతస మింక నేల యీ
ఫలములు పంచదారలును । ప్రాజ్ఞున కాదరవాక్య మొండు కా
వలయును శాశ్వతంబులె యు । పాయనముల్ పదివేలు చూడఁగన్
తే॥ పిన్నవారలయ్యుఁ ♦ బెద్దవారలు వోలె
సుగుణగణము గల్గి ♦ పొగడఁ దగిన
వారు మిమ్మువంటి ♦ వారల దర్శించి
కనులు సార్థకములు ♦ గావె జగతి.
మ॥ నను రాజన్యకిరీటకోటివిలస ♦ న్నానావిధానూనర
త్నని కాయద్యుతిరంజితాంఘ్రి యగు భూ । నాథున్ గజం బొక్కరుఁ
వ్వనికిన్ గైకొనివచ్చె దానికతనన్ । బద్మాక్షి మీదర్శనం
బును సల్పన్ గలభాగ్య మబ్బె నయనం ♦ బుల్ ధన్యతన్ బొందగ।
సీ॥ అనివచియించెడు । నవసరంబున వ్యాధ

కన్యాలలామ భూ ♦ కాంతుని గని
యఖిలపూజ్యుండగు ♦ నాతని కానమ
యానుకూలంబుగ నహారీతి
హృదయ మర్పణఁ జేసి ♦ యిక్షుశరాసన
సాయకబాధిత ♦ స్వాంతయగుచు
నిఁదుకరస్పర్శ ♦ నెంతయు వికసించు
కుముదంబు వోలె సంకోచము విడి
యీమహాభాగుఁ డేదేశ ♦ మేలువాఁడొ
యన్నివిధములఁ దగినట్టు ♦ లున్నవాఁడు
కరిని వెదకుచు వచ్చెనో ♦ కాక నన్నుఁ
దోయిలిగఁ గొనవచ్చెనో ♦ తోఁచదయ్యె॥
చ॥ అతనుఁడు రూపహీనుఁడు శ♦శాంకుఁడు సాంకుఁడు చైత్రుఁడన్ననో
ఋతువిభవంబుఁ బట్టి యలరించును ప్రాణిచయంబు నీతనుం
డతులతనూవిలాసయుతుఁ♦డై యకలంకుఁడునై యజస్రదీ
పితవిభవాభిరాముఁ డయి ♦ ప్రీతిని గూర్చును ప్రాణికోటికిన్.
క॥ అనుకంపానిధి వోలెన్
గనుపట్టు నితండు మామక మనోధనమున్
గొనినాఁడు చూచుచుండం
గనె యెంతటి చతురమతియొ ♦ గద వీఁడరయన్
తే॥ శాంతమైన మోము చల్లని చూపులు
నమృతబిందులొలుకునట్టి పలుకు
లనుభవింపఁదగినయట్టి రూపము వీని
యాభిజాత్య మెఱుగునట్లు సేయు॥
తే॥ చూడదగినవాడు సోయగంబుగలాడు
కనికరంబు పట్టు ఘనుఁడితండు
మన్మనోరథంబు మదనాగ్నిసాక్షిగ
దీర్పకున్న వేరు తెలివుగలదే॥
ఉ॥ కాంచనచారుగాత్రు డరిఖండనపండితుడీ నృపాలునిన్

గాంచినయంత నామనసు ♦ కాముని కోలలకెల్ల లక్ష్యమై
యించుక చంచలించెడు మహీపతికిన్ గృపగల్గకున్న నే
వంచితనౌదుగాక సరివారలలోన యశంబు గాంతునే॥

వ॥ అని యవ్వారారోహ కుహనానృపాలాయత్తస్వాంతయై యిందీవరజైత్రంబు లగు నేత్రమాలికల నాతని మనోహరాంగంబున నింద్రనీలమణిగణాలంకారంబుఁ గావించుచు నించుక చింతించి హఠాజ్జనితసంభ్రమంబున నులికిపడి నిట్టూర్పుబుచ్చుచు

చ. మఱు దతిలోకవిక్రముఁడు ♦ మానినిచిత్తము చంచలంబు బం
ధురమగువస్తుదర్శనము ♦ తోడనె లోభముఁగూర్చు శాస్త్రపుం
దెరువతిగహ్వరంబు గణు ♦ తింపగ నహహ వయోభిరామలౌ
తరుణుల కిట్టిచో ననుచి ♦ తం బుచితం బెఱుఁగంగవచ్చునే॥

శా॥ అన్యుండంచుఁ దలంప కింత కులమ♦ర్యాదన్ విసర్జించి సా
మాన్యస్త్రీవలె నొక్కరాకొమరునిన్ ♦ భావంబునన్ నిల్పితిన్
గన్యాధర్మముఁ గోలుపోయితిని రా♦గద్వేషభూయిష్ఠమౌ
నన్యాయంబును మాలిఁ దాల్చితిని పు♦ష్పాస్త్రుండు బాధింపఁగన్

క. కులగోత్రంబులఁ దెలియక
వలచుట యోగ్యంబె యానృ♦పాలునిఁ గనినన్
జలియించె నాదుచిత్తము
కలదే యెటనైన నిట్టి ♦ కార్యం బరయన్

తే॥ ఎదిరిచిత్తంబు నెఱుఁగక ♦ యెట్టికార్య
మేని యిదమిద్ధమని నిశ్చ♦యింపఁ దగునె
యతనిఁ గామించితిని గాని ♦ యతఁడు నన్నుఁ
దలఁపకుండిన నేమి కా♦వలయు నింక॥

చ॥ అనిమిషమానివర్యుఁ డపు ♦ డాడినవాక్యము విశ్వసించి నా
కనఘుఁడు కార్తికేయుఁడు ద♦యానిధి వల్లభుఁడంచు సంతసం
బినుమడిగాగఁ దత్పదము♦లే భజియించుచునుంటి నిప్డు డీ
జనపతియందు లగ్నమయి ♦ స్వాంతము క్రమ్మర దేమిహేతువో

తే॥ అమలభక్తిఁ ♦ దారకారి కర్పితమైన

మన్మనంబు రాజ • మాత్రునందుఁ
దగులుకొనునె యింత • తలఁపగ శరజన్మ
కృత్యమగునొ యేమొ తెలియుమిట్లు॥

వ॥ భక్తత్రాత యగు శరజన్మునందు లీనమగు నాహృదయంబు లాతిచోఁ జేర నవకాశంబేటిది? కావున నీతఁడు నామనంబుఁ బరీక్షింపఁ గపటవేషంబుఁ దాల్చి వచ్చిన యుమాకుమారుండె యగునని లవలీకన్య డెందంబు స్థిరంబుఁ జేసికొనియె. అప్పుడు స్కందుండు వయస్యఁ గాంచి యిట్లనియె.

క॥ పరకామినుల యదంతం
బరయఁగఁ దగదండు రట్టు • లయ్యును మీయా
దరము నను బ్రోత్సహించెడుఁ
దరుణీ నను గుఱించి యన్య • థా తలఁపకుమీ॥

చ॥ అమలవయోభిరామ యగు • నట్టిది మీచెలి యామెనామవ
ర్ణము లెఱుఁగంగ వచ్చునె య • నంత తపంబొనరించి యెవ్వఁడీ
యమను సుపుత్రిగాఁ బడసె • నహుఁడనేని వినంగ నుంతతె
ల్పుము వినఁగోరికయ్యెఁ బుడు•బోఁడి యొకింతయు దాచకెయ్యెడన్

చ. అనుటయు నామె యిట్లను ధరాధిప యుల్లదె పట్టణంబు క
న్గొనుము నిషాదపుంగవుఁ డ•కుంఠితతేజుఁడు దాని నేలు నా
తని కనుఁగుం గుమారి వని•తామణి మాచెలి సద్గుణాంబురా
శి నిఖిలశాస్త్రవేదిని య•శేషకళానిధి వల్లినాఁబడున్॥

క॥ జనకుఁడు ధనురాస్యండీ
వనజానన కహుఁడైన • వానినిఁ బతిగా
నొనరింపఁ దలఁచుచున్నాఁ
డనఘుఁ డతనికోర్కె యెట్టు•లగునో యింకన్

వ॥ అనిపలికిన నాలించి యానృపాలుండు మరల నిట్లనియె.

క॥ కరిబాడ తెలియకున్నన్
దరుణీ మీదర్శనముక • తన ముదమయ్యెన్
గరిరాజగమన మీచెలి

స్మరణీయగుణాఢ్య యగుట నా స్వాంతము పొంగెన్॥

క॥ మాశబరేంద్రునిసద్యశ
మాశాలతలందుఁ బ్రాకి • యలరారుటగా
శ్రీశసమావదన విఁదు సు
రేశ ప్రతిమానుఁ డతఁ డ • హీనుండరయన్॥

వ॥ అని పలుకుచు శబరాంగనామధురోక్తులఁ గామతాపంబుశమింప శేయ నెంచి నిజభ్రాతయగు గజముఖుని బ్రార్థించిన.

సీ॥ కరట మదాస్వాద • నరత మధువ్రత
ఝుంకార బధిరితా • శాముఖంబు
విచలచ్ఛ్రుతిద్వయీ • విర్భవదాశుగ
పాతిత బహుపాద • ప వ్రజంబు
నట దతిక్రూరశుం • డాదండఖండిత
కమనీయబహువల్లిశా • ఖాచయంబు
ప్రబలదంతప్రాస • భజ్యమానాఖిల
స్ఫాటిక వేదికా • సంచయంబు
ప్రళయకాలపయోదగ • ర్జాసమాన
బృంహితధ్వనినిర్భిన్న • పృథులశైల
సానుసముదయ మగుచు నం•జనధరాధ
రంబుగతి నేగుదెంచె గం•జం బొకండు॥

వ॥ అమ్మత్తవారణంబుఁ గాంచి వయస్య భయంబున నెందేనరిగె.
వల్లియు సంభ్రమంబున

క॥ సన్నడుము వడక వదనము
స్విన్నముగా హారపంక్తి • చిక్కువడంగా
బెన్నెరులు కటిని వ్రేలఁగఁ
గన్నీరొలుకంగ భామి • కాంతుని జేరెన్॥

వ. అట్లుజేరి డగ్గుత్తికతో దయనీయస్వరంబున

క॥ నరనాథ యాత్రరక్షా
పరత నృపాలురకు ధర్మపద్ధతియగు నీ

కరిని తొలఁగించి యబలలఁ
గరుణించి కులంబునీతి • గావుము ప్రీతిన్॥

క॥ ధరణీశ మత్తవారణ
మరుదెంచుచు నున్న దంజనాద్రివలెన్ భీ
కరమై దళితచ్ఛాయా
తరునికరం బగుచు నదియె • దానిన్ గనుమా॥

క॥ అని దీనయగుచుఁ బ్రార్థిం
చినఁ గుహనాభూమిపాల • శేఖరుఁడు మనం
బున నెక్కొనుకనికరమున
వెనకయ్యఁ గుఱించి యిట్లు • వినుతిఁ లొనర్చెన్ .

మ॥ అనఘా నీవు పరాత్పరుండవు త్వదీ•యారాధనం బన్న లో
కనికాయంబునకున్ ముఖంబగు జగత్కర్తృత్వముంబూని యెం
దును మున్ బూజ్యుఁడవై చరించెదవు భ•క్తుండెద్దియో నేరముం
బొనరించెన్ గినుకన్ వహింపకు దయాం•భోరాశి విఘ్నేశ్వరా॥

తే॥ అనుచు వేడి యొక్క • యంబకంబును నమ
స్కారపూర్వకముగ • కరి గుఱించి
విడుచుటయును గజము • వేగమ వెన్నిచ్చి
పరచె నడవి వల్లి • భయము తలఁగ.

వ. అంత వయస్య భయకంపితగాత్రయై పుడమిపతిచెంత నిలిచి
యున్న వల్లిన్ జూసి సవినయంబుగ భూపతి కిట్లనియె.

చ॥ అపహృత వైరివీర మృగ • యాభిరతిన్ జనుదెంచి భీకర
ద్విపచరణాహతిన్ బడి య•దృష్టముఁ గోల్పడనున్న మా యెడన్
విపులకృపన్ వహించి మముఁ•బ్రేముడిఁ గాంచితి తావకీనమౌ
నుపకృతిన్ యెన్ని జన్మముల • నొందిన విస్మృతి గల్గునే యికన్

తే॥ విశ్వసించిన వారల • విడువకుంట
భయము జెందిన వారిఁ గా • పాడుచుంట
యనరలైపారు వారి వె • న్నంటకుంట
క్ష్మాధిపుల ధర్మమౌఁ గదా • ధరణినాథ.

క॥ తనధర్మమును విడువాడక
యనుచితమార్గమున వనవ ♦ కన్యల సర్వ
ర్తనమునఁ జరింపఁ జేయుట
యనఘుండైయున్న యోగ్య ♦ మవనీపతికిన్.
తే॥ ఎల్లధర్మములకు ♦ నిల ముఖ్యమైనది
ప్రాణమందు రట్టి ♦ ప్రాణదాన
మునకు సాటి కలదె ♦ జననాథ మా ప్రాణ
ములను నిల్పినాఁడ ♦ వలఘుకరుణ.
చ॥ అని వచియించువేళ మృగ ♦ యార్థము వేరొకలాతిపల్లెకో
చని యరుదెంచునాతఁడు ని♦షాదకులేంద్రుడు బొందుదండుదోఁ
దనసుతఁ గాంచి పోయెడి ము♦దంబునవచ్చి నమూల్యరత్నముల్
కనక విభూషణంబులు ఫ♦లంబులు గైకొని యవ్వనస్థలిన్.
తే॥ అవ్విధంబున నరుదెంచు ♦ వ్యాధపతినిఁ
గాంచి సంశయగ్రస్తుఁడై ♦ క్రౌంచవైరి
పుడమినాయకరూపంబు ♦ విడచి విశ్వ
సింపఁదగు రూపమును ధరి ♦ యింపనెంచి॥
సీ. ముడితలుపడ్డమో ♦ మునయందు ఎలిబూది
మూఁడు రేఖలుగాఁగఁ ♦ బూసినాఁడు
ఒకకొంత మిగిలి ము ♦ డికిరాని మడి వెంట్రు
కల నీలిగ్రాటిచేఁ ♦ గట్టినాఁడు
వాడినతామర ♦ కాడనా వ్రేలెడి
యొకచేత దండంబు ♦ నూనినాఁడు
మిట్టజొమ్మున యోగ ♦ పట్టితోఁ బెనఁగిన
సొబగు జందెముఁ జలిఁ ♦ జుట్టినాఁడు
కటిని కాషాయవస్త్రంబుఁ ♦ గట్టినాఁడు
జింకచర్మంబు మూపునఁ ♦ జేర్చినాఁడు
గడగడ వడంకు చొక్కవృ ♦ క్షమ్ము నీడ
నిలిచి యున్నాఁడు వృద్ధుఁడై ♦ నేలఱేఁడు.

తే॥ అటుల నిలచిన వృద్ధఁ • రామరేంద్రుఁ
గాంచి భక్తియుతుండయి • కరము మోడ్చి
వ్యాధనాథుఁడు పలికె నీ • హారకిరణ
కరసదృశమంజులోక్తుల • గౌరవమున-

చ॥ అవనిసురాన్వయోదధిశ • శాంక భవాదృశులైన భూసుర
ప్రవరుల దర్శనంబఖిల • పాపవినాశకమంచు నెప్పుడున్
దవిలినభక్తి మీచరణదాస్య మొనర్పఁగఁ గోరుచుండు శాం
భవము గుమంత్రరాజము భ•వద్ధనమాట యెఱింగి యెంతయున్॥

తే. అనఘమైన తావ • కాగమనము శుభ
సూచకము సమస్త • సుకృతఫలము
ప్రాప్తమయ్యె నాక • యాచితముగ నేడు
జను తరించెఁ గులము • ఘనతఁగాంచె

తే॥ సంతత పరోపకార వి • శాలచిత్తు
లాఢ్యగుణసంయుతులు మీర • లహరహింబు
మాదృశుల భక్తులను దరిం • పఁగఁ జేయఁ
దలఁచి కాదె చరింతురు • ధరణియందు.

వ॥ అని నమస్కరించి కూతుఁ దోడ్కొని నిజనగరంబున కేగె నని పలికినదరువాత నేమయ్యెనని యడిగిన సూతుండు మునుల కిట్లనియె.

ఆశ్వాసాంతము. క॥ అవిరళదేవీపూజా
భవదఖిలైశ్వర్య విమల • భావసహిత స
త్కవికల్పయ నల్పవిభవ
రవిసన్నిభ తేజ సుగుణ • రత్నాభరణా॥

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనారాధ్యవం శాబ్ధికిఁ బూర్ణశశాం
కుఁ డయ్యె నేతల్లి సావిత్రి • కెనయై బుధుల్ మెచ్చ మహిని
పాతివ్రత్య మహిమఁబూనె నట్టి నందయకు గా • రమగు
ద్వితీయ పుత్రుండఁ గౌండిన్య గోత్రుం దక్షిణామూర్తికిని

శివానందునకును సోదరుండఁ గూరిమి యగ్రజుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మదీయమయి యలరు-
నట్టివల్లీపరిణయ కావ్యం ◆ బిందు
నమలమగు తురీయాశ్వాస మయ్యె దీని
సతము రక్షించుఁ గావుతఁ ◆ జంద్రమౌళి॥

---

శ్రీ శివాయనమః

# వల్లీ పరిణయము

## పంచమాశ్వాసము

—[o]—

క॥ విలసద్గంగాజల ని
ర్మల వచన ధురీణతా వి ♦ రాజిత సుగుణో
జ్జ్వల దసమానాంగా ద్విజ
కులమండన యాబలూరి ♦ గోత్రనిధానా.

తే అవధరింపుము శూర ప ♦ ద్మాది సకల
దానవానీక కానన ♦ దావపావ
కాయమాన మహాసేన ♦ ఘనకృపాను
కలిత వల్లీపరిణయమున్ ♦ కథను వేడ్క.

తే॥ అటులఁ దండ్రితోడ ♦ నవసథంబున కేగి
వ్యాధకాంత భూసు ♦ రాగ్రసరుని
గుఱించి పలువిధముల ♦ గొనకొని తలపోసె
నబ్బురంబు సంశ ♦ యంబు మిగుల.

ఉ. ఆ నవసూనధన్వి వసు ♦ ధాధిపుఁడో నరపాల రూపమున్
బూనిన స్కందుఁడో నిజము ♦ బుద్ధికిఁ దోచదు మానకీనమా
మానసమా చలించు నిది ♦ మార్గమటంచు నెఱుంగఁ జెప్పవా
రేనియుఁ గానరా రిపుడిఁ ♦ కేమి యొనర్పఁగ నేర్తునక్కటా.

చ. అలఘుచరిత్రుఁ డాతఁడు ధ♦రాధిపుఁడే యని యెంతునా కృపా
కలిత మనస్కుఁడై శబర ♦ కాంతుఁడు నన్గనవచ్చినప్పుడు
జ్వలమగు రాజరూపమును ♦ బాసి ద్విజాకృతిఁ దాల్ప నేర్చు
యిల నెటనేఁ బొసంగునె యా♦హీనము లిట్టివనల్ గణింపఁగన్

తే॥ రాచరూపంబు మాని ధ ♦ రాసురాకృ
తిని వహించుటయును పడా ♦ స్యుని భజించు
వాఁడు చిత్తం బతని యెడ ♦ నాటుటయును
గారణములుగ నాతండు ♦ స్కందుఁడె యగు.

తే॥ అనుచు నెట్టకేల ♦ కాలేమ కుహనా వృ
పుండు పార్వతీసు ♦ తుండె యనుచు
నిశ్చయించి యతని ♦ నే స్మరించుచు లాతి
పనులు గొనక విరహ ♦ బాధిత యయి॥

సీ॥ కళకళలాడు చ ♦ క్కని ముద్దు మొగమున
దిలకంబు గుదురుగా ♦ దిద్దదయ్యె
మిసమిసలాడు నె ♦ మ్మేనఁ బన్నీటితోఁ
గలిపి సుగంధంబు ♦ నలద దయ్యెఁ
దళతళలాడు క్రొ ♦ త్తరకంపు చీనాంశు
కంబును బేర్మిమై ♦ కట్టదయ్యె
నిగనిగలాడు పె ♦ న్నెఱిగుంపుఁ గొనగొళ్ళ
గీరి చిక్కెడలింపఁ ♦ గోరదయ్యె
సలలితపరిపాక ♦ సదృశమైబింబంబు
నైన సరకుగొనని ♦ యధరమునకు
లక్క బూయదయ్యె ♦ నక్కాంత శరవణ
భవుని మీఁద వలపు ♦ ప్రబలు కతన॥

చ॥ పిలువ దనుంగుచేడియలఁ ♦ బల్కిన నుత్తర మీయ దింతయున్
బలుకల జేరి పద్యములు ♦ సెప్పదు నిష్కుట వల్లికామత
ల్లులకు జలంబొసంగదు వి ♦ లోల విలోచన కామబాణపం
క్తులకుఁ జలించి చిత్తమునఁ ♦ గోరిక మించి త్యజించి చైవులన్

మ॥ అళినీలాలక శంబరాహిత ధను ♦ ర్జ్యాముక్త తీవ్రాంబక
జ్వలన జ్వాలలఁ గ్రాగి చేడియల నీక్షల్ గాంచునాహారమున్
దలపక్ బోదు సువర్ణభూషణములన్ ♦ దాల్పంగ వాంఛింపదా
కులమై యన్యులఁ గూర్చినెమ్మదిసి గొం ♦ దుక్ జెందు నెంతేనియున్

క॥ ఆ సురసేనాపతి స
న్మానమెయిన్ గాంచ వచ్చె • నని యెంతయు సం
తోసముఁ జెందితి నిటు బరి
హాసము పాత్రముగఁ జేయ • నని యెఱుఁగ కర్క॥

చ॥ కరిఁగని భీతిఁజెంది ననుఁ • గావుమటంచును వాసి సంతసే
పరమదయార్ద్రచిత్తుఁడయి • భద్రగజంబును సంహరించె నా
తరుణమునందె యాతని సు • ధామయదేహముఁ గాగలించి నా
కరము కరంబునం దిడక • కాముని బారికిఁ జిక్కి స్రుక్కితిన్॥

తే॥ శ్రవణపేయంబు లగువాని • సదమలోక్తు
లాలకించుచు భ్రాంతి దే • హంబె మఱచి
చూచుచుంటిని గాని సు • శ్లోకుఁ డతని
మనసు దెలియఁగ నేరనై • తిని కదంక॥

మ॥ కరుణాశాలి షడాననుండు సురలో • కస్తుత్యమై యొప్పునా
కరజన్మాకృతిఁ బాసి నాకొఱకు రా • జన్యాకృతిన్ దాల్చి చె
చ్చెర నేతెంచి మదీయచిత్తము హరిం • చెన్ బ్రాణముల్ నిల్పనా
కరిఁ బోకార్చి మనోజబాణముల పా • ల్గావించె నన్నెంతయున్॥

మ॥ చనునే యిట్టిమహానుభావుఁడవు నా • స్వాంతంబు నేలాగొ కై
కొని నన్నిచ్చట డించిపోయితివి నీ • కున్ ధర్మమున్ జెప్ప నే
ర్తునె మాధృక్ష్ఫితమండలంబునకు సం • తోషంబు సండిదిల్లఁ జే
యు నినున్ బాసి సహింప శక్యమగునే • యోదేవసేనాపతీ॥

ఉ॥ ఇంతటివి స్తృతంబగు మ • హీతలమున్ భరియింపనేర్చు ని
న్నెంతయుఁ గూర్మిఁ గోరు జలజేక్షణ బ్రోచుట భారమయ్యె నే
కంతుఁడు వాడికోల లెదఁ గాడఁగ నేయుచు నున్నవాఁడు నా
స్వాంతము చంచలించెడుఁగ • దయ్యకృపానిధి యెట్లుసేయుదో॥

చ॥ అతుల పరాక్రమక్రమ జి • తాఖిల నిర్జరవైరివీర నీ
చతురత యేరికైనను షొ • నంగున నన్వలపింపఁజేసి యం
చితగతి నిశ్చలంబయిన • చిత్తముఁ గైకొని యూమకీన వాం
ఛితమును ద్రోసిపుచ్చితివి • శ్రేయముఁ గూర్పఁదలంపవాయిఁకన్

క॥ అసమానభక్తి నిను మా
వసమునఁ జిత్రించి పూజ । న మొనర్చెదు నీ
కిసలయపాణి మొదల్ కృప
పొసఁగింపక యుంట తగునె । పురుషవరేణ్యా॥

చ॥ త్రికరణశుద్ధిగా నిను వ । రించి త్వదేకశరణ్య యైన కాం
తకు మఱి వేర దిక్కు గల । దా నిఖిలజ్ఞుఁడ వీ వెఱుంగవే
సకల సురాసుర ప్రకర । సన్నుతపాదసరోజయుగ్మ తా
వక కరుణావిహీనులకుఁ । బంచిన సౌఖ్యము గల్గునేయిలన్॥

వ॥ అనియనేకవిధంబుల నమ్మత్తకాశిని కార్తికేయాయత్తచిత్తయై వలరాచకాకల కోరువలేక దినమొక యేడుగఁ గడపుచుండె. నంతనొకనాఁడు,

సీ॥ పొదుగులఁ బాలఁ జే । పుకొని లేఁగలఁగూర్చి
యంబా యనుచుఁ బారు । నాకదుపులు
మూఁపుల పైగడ్డి । మోపులఁ దాల్చి వే
గమ కొట్టములఁ జేరు । కర్షకులును
పణ్యవీథులనుండి । బహువస్తువుల సేక
రించి యిండ్లకుఁ బోవు । గృహపతులును
ప్రొద్దుగ్రుంకెడు నింకఁ । బురిఁ జేరుదుమె యంచుఁ
బలుకుచు నడచెడు । పాంథజనులు
నగ్నిహోత్రాదినిత్యకృ । త్యములఁ దీర్ప
వేగిరంపడు నైష్ఠిక । వితతి గలిగి
తామరసభవుసృష్టిచి । త్రంబులెల్లఁ
దెలుపకయె తెల్పుచును సంధ్య । యలరె మిగుల॥

చ॥ పొలమున నెల్లెడన్ దిరిగి । పుల్గులేవో యొకకొన్ని గడ్డిగిం
జలో మఱి పండ్లచెక్కులో వె । సన్ గొని గూండ్ల వసించుపిల్లలే
వలలకుఁ జిక్కెనో చిలువ । పాలయి ప్రమందెనో యంచు భీతిమై
నలజడి నొందుచున్ గగన । మంతట శ్రేణులు గట్టి పారఁగన్.

తే. పరిమళత్కుసుమ సుగంధ ♦ భారజనిత
మందగమనుం డగుచుఁ బవ ♦ మానుఁ డద్రి
మలయ గిరిశృంగమునుండి ♦ మహికి వెడలె
దంపతీపూజ సేయు ను ♦ త్సాహముమెయిం.

తే॥ కువలయేశ్వరుఁ డదె ద్విజ ♦ కోటి గొలువ
నరుగుదెంచుచు నున్నవాఁ ♦ డనుచుఁ దలఁచి
గగనరమ నీలి పుట్టంబుఁ ♦ గట్టె నాఁగ
నంధకారంబు దిక్కుల ♦ నలముకొనియె.

తే॥ చక్రభంగంబుఁ గూర్చి దో ♦ షాకరత్వ
మును వహించినవాని రా ♦ జనుచు గార
వించుటేల యనుచు మది ♦ నెంచె నాఁగఁ
బద్మినీసతి నెమ్మోము ♦ వాంచె నపుడు

మ. తనకున్ రాజు ప్రియుండుగాతమనియు ♦ త్సాహంబునన్ యామినీ
వనితారత్నము శుభ్రకుందకుసుమ ♦ వ్రాతంబు మందారు జం
తునికాయావనమైన విష్ణుపదమం ♦ దున్ జల్లెనా నాకసం
బున నక్షత్రము లొప్పెఁ జూపఱకు స ♦ మ్మోదంబు విందైతిగన్

చ॥ క్రతుశతకంబొనర్చి త్రిజ ♦ గత్పతియైన బలారియాత్మకున్
హితమొనరించుసాధ్వి యని ♦ యెంతయుభక్తి దలిర్ప దేవతా
సతులు శచీపురంధ్రి కిడు ♦ స్ఫాటికదర్పణమో యనంగ బ్రా
క్షితిధరశృంగభాగమున ♦ జెన్నలరారె శశాంకుఁ డయ్యెడన్.

తే. వ్యాధకాంతుని సత్కీర్తి ♦ వల్లి జగముఁ
బర్వెనాఁగను కౌముదీ ♦ వార మపుడు
ప్రబలి నైల్యగుణంబు ప్ర ♦ ధ్వంస యనున
భావమును జెందునట్టులఁ ♦ బ్రబలె దిశల

తే. ప్రణయకుపితలైన ♦ ప్రౌఢాంగనల వశ్య
ముగ నొనర్చి సౌఖ్య ♦ మును గడించు
కాంక్షఁ జేసి మదిని ♦ కాముకజన మర్హ
వేషములను దాల్చి ♦ వెడలి రపుడు

వ॥ అత్తఱిఁ బుళిందమత్తకాశిని విరహోద్దీపకంబులగు నయ్యైవస్తు
వుల కులికిపడి మలయకుమారు నుద్దేశించి.

చ॥ చిలువలఱేఁడు మ్రింగి నిను • జీర్ణముగామిఁ ద్యజించినంత ను
జ్జ్వలవిషపూరితుండ వయి • చయ్యన నిట్లురుదెంచి యింతలోఁ
దలఁపక యుద్ధతుండవయి • తామరసాక్షుల నేచఁ బూనితే
మలయకుమార నీ నడక • మందముగానిఁక నూరకుండుమా.

తే॥ ఎట్టివారికైనన • నెంతయు వడకింతు
వీవు నీదుగుణము • నిట్టిదనుచు
జెప్పరాదువరుణుఁ • జేరి దాహముఁ గూర్తు
వన్యగుణమెనీకు • నబ్బెగదర.

తే॥ తుందుడుకవంచుఁ జెఱంగి ని • న్నిందుధరుఁడు
తనతనువుగాఁగఁ గొనియెనై • నను కడంగి
యెట్టులోఁ బైటఁ బడి జల • జేక్షణలకుఁ
దాపముం గూర్తు నాలి భూ • తంబ వగుచు.

తే॥ తండ్రిగుణమె నీకుఁ • దగులమయ్యె నతండు
తనువులేనివాఁడు • తలఁప నీవు
కానరాక పోకి • కడగండ్లఁ బెట్టెదు
విరహిజనుల నెపుడు • విడువకింత.

వ. అని మలయానిలుని దూఱి శశాంకు గుఱించి యిట్లనియె.

చ. సరసుఁడ వంచు నిన్ను దన • సన్నిధిఁ జేర్చిన ద్రోహబుద్ధివై
గురునిసతిన్ హరించితివి • గొబ్బునఁ జక్రముల౯ హరించి తీ
క్ష్ణరుతలఁ దన్ని తంత్రికిని • భంగముఁ గూర్చితి వీవునీనిశా
చరగుణముల్ దలంచిన న • సహ్యము దోచు శశాంక యెంతయు౯

చ॥ కువలయనాయకుండ వని • కోరి నినున్ శిరసావహించె నా
భవుఁ డనిపెల్లురేగకుము • పంకజవైరి కళంకి వోట నాఁ
డపమతిఁ గూర్పఁ డే యజనమందుఁ • బదాహతి విస్మరించితే
యవని స సత్ప్రవర్తనుల • కాదట భంగము గల్గకుండునే.

సీ॥ జనకుండనుక్షణం ♦ బును భంగపాటొంది
యొకపక్షమున బొంగు ♦ చుండువాఁడు
తల్లి దిగంబరు ♦ తగులంబుఁ జేసి యె
ప్పుడుఁ బలుత్రోవలఁ ♦ బోవుచుండు
సైదోడు మగనిప ♦ క్షస్థలమున నెక్కి
యాటాడు నట్టిగ ♦ య్యాళిగంప
మేనల్లుఁ డనయమ్ముఁ ♦ బూని యబలలపై
దం డెత్తుచుండెడు ♦ దుండగీఁడు
సహజదోషాకరుఁడవు నీ ♦ చరితమెల్ల
దోషభూయిష్ఠ మగుట నో ♦ తోయజారి
కనలి పరమేశ్వరుండు నీ ♦ కళల నెల్లఁ
బంచియిచ్చుచునుండు దే ♦ వతల కెపుడు.
తే. లక్ష్మితోఁ బుట్టినంత నే ♦ లా పొసంగు
నీకు సద్గుణగణము ర ♦ త్నాకరోద
రమునఁ బుట్టఁదె వహ్ని ధ ♦ ర్మముఁ ద్యజించి
యన్నిఁటిని గాల్చుచున్నవాఁ ♦ డలిగి మిగుల.
సీ. గురునకె ద్రోహంబుఁ ♦ గూర్చితి వనుటకు
సర్వజ్ఞుఁ డగు బృహ ♦ స్పతియె సాక్షి
పరకామినుల బల్మి ♦ బట్టుదు వనుటకు
దక్షవినుతయగు ♦ తారసాక్షి
యమరులనైన ల ♦ క్ష్యయసేయువనుటకు
సఖిలేశ్వరుండగు ♦ హరుఁడె సాక్షి
కన్నవారికిని భం ♦ గముఁ గూర్తువనుటకుఁ
బ్రవిమలుండగు సరి ♦ త్పతియె సాక్షి
నీయయోగ్యతఁ దెల్ప న ♦ నేకము లగు
సాక్ష్యములు గల్గుఁ గాని యే ♦ సరణిఁ గనిన
నీదు రాజత్వమును నిల్ప ♦ లేదు జగతి
విరహిణీజనమార ♦ వివేకదూర.

తే॥ గాలి కగ్ని సహాయుఁడౌ • కరణి నీకు
మన్మథుఁడు తోడఁబుట్టఁ జేసి • మాదృశలను
వెతలఁ గుదువుచున్నాఁడు • నిబ్బరిగి
నీకు ధర్మంబు తెలియునే • నీరజారి.

వ. అని మదను నుద్దేశించి మఱియు నిట్లనియెఁ

క. లిఁకఁ గన్నవారు లోకం
బున కున్ రతుకులు వారి • పోలిక యుంతేఁ
లనరాదు నీయెడల నే
మనవచ్చును విధికృతంబు • నంగజ చెపుమా.

చ. మదన పరాక్రమింతువు • మానినులన్ విరహాసమీన్మలన్
గొదకొని తీక్ష్ణబాణము • కున్ గురిసేయఁ దలంపయ్యె నీ
వడయతఁ గాంచినంతన పు • రాంతకుఁ డంతటివాఁడె చంచలిం
చెఁ దలిరుఁబోండ్లఁ గూర్చి యుఁకఁ • జెప్పఁగ నేటికిమాటిమాటికిన్

మ॥ ద్విజరాజంచును మేనమామయను చా • త్మీయుఁడటం బిట్లు
కజవైరిన్ దరిఁజేరనిచ్చెదు వి • వేకం బింతయున్ లేక యుం
గజ నీమాతృగృహంబుఁ గూల్పఁడి భర • తాఖండంబుఁ బోకార్పఁడే
కుజనుం డాతఁడు మేలు గూర్చునని నీ • కున్ బ్రత్యయం బేటికో.

సీ॥ కలుద్రావి మత్తిని • కఠినంబుగాఁ బల్కు
గందుతుమ్మెదలె నీ • కాలిబలము
పరులమాటలె నేర్చి • బంధనం బెడలని
పక్షిశాబకమె నీ • వారువంబు
ఒకకొంతకాలంబె • యుండి జీర్ణించెడి
నామనిదొరయె నీ • కైన సఖుఁడు
పక్షపాతంబునఁ • బ్రబలి యుద్రేకించు
దోషాకరుండె నీ • తోడునీడ
సారరహితంబులైన పు • ష్పములె నీకు
సాయకము లిట్టి దుర్బల • సమితిఁ గూడి

జగములఁ గలంప నేర్చితి ♦ సాహసమున
నీసమర్థతఁ బొగడంగ ♦ నేర్వఁ గలమె.
క॥ సరసిరుహాంబకుఁడ వనుచు
సరసిరుహాంబకల నేచ ♦ సాగెదు నీకా
సరసిరుహారి హితుండే
సరసిరుహాంబకలు శత్రు ♦ జాలమె చెపుమా.
చ॥ పురహరుఁ డగ్ని నీతనువు ♦ బూదిగఁ జేసి యేదొ నెపంబునన్
మరల నొసంగెఁ బ్రాణములు ♦ మాదురదృష్టము కారణంబుగా
స్మర యిఁకనైన దుండగఁపు ♦ చైవుల మాని వియోగినీజనా
దరము వహింపుమయ్య తలి ♦ దండ్రులసద్గుణముల్ దలంచుచున్.
చ॥ ఇది జడగాదు వేణి విష ♦ మే యిది కస్తురి కంఠదేశమం
దిది కుసుమంబు చంద్రికళ ♦ యే యని యెంచకు మాళి భూతిగా
దిది విరహంబు హేతువుగ ♦ నేర్పడినట్టిది మేన పాండిమం
బెదఁ బురనైరియంచు నను ♦ నేయకు మో సరసీరుహాంబకా.
మ॥ చిలుకరవాలు నెక్కి వెడ ♦ సింగిణిఁ బూములుకుల్ ఘటించి నీ
నులవఱ కల్లె లాగి మము ♦ నొవ్వఁగ నేసెదు పాడి యౌ నసీ
పలఁతితనంబుఁ జూప సరి ♦ వారలు శూరులు లేర పంకజా
స్యలఁ బ్రహరించుకన్న ఫల ♦ మన్యము గల్గదె నీదువిద్యకున్.
వ॥ అని విరహంబునన్ బలుకు వల్లిన్ గాంచి నెచ్చెలి యిట్లనియె,
క॥ మగువా నీకిది తగవా
మృగయారతి వచ్చినట్టి ♦ మేదినిపతిపైఁ
దగులము జెందెదు వింతలు
నగరే నీయునికిఁ గన్న ♦ నానాగతులన్.
ఉ॥ నాతదమానివర్యఁ దల ♦ పాఁడు వచింప వినంగ లేదె క్రొం
చారియె నీకు భర్త యగుఁనంచు నదెల్లను విస్మరించి భూ
దారుఁ డెవండొ యొక్కరుఁడు ♦ తజ్ఞుడు గన్పడినంత వానిపై
గూరిమిఁ జెంది చిత్తజుని ♦ కోలలకున్ గురియైతి వేలొకో.

ఉ॥ అనవుడు నవ్వి యిట్లనియె ♦ నంబుజలోచన నామనోధనం
బును గొనిపట్టి యాతఁడొక ♦ భూపతిమాత్రుఁడు గాఁడు దుష్టశా
సనచతురుండు శౌర్యనిధి ♦ సాధుజనావనశాలి యద్రిజా
తనయుఁడు కార్తికేయుఁ డగు ♦ తథ్యము సంశయమేల నీకికన్.

తే॥ ఉపవనంబున నేమఁగు । నెపముఁ జేసి
కానవచ్చినయతఁడు భూ । కాంతుఁ డనుచుఁ
దలఁపఁగా నేల తారక । దైత్యహంత
యనుచు మది విశ్వసింపు మో । యబ్జవదన.

చ॥ అతఁడు శశాంకమౌళితన ♦ యాగ్రణి స్కందుఁడె గాక ధారుణీ
పతి యగునేని వ్యాధనర ♦ పాలుఁడు నన్నవచ్చినప్పు డం
చితమగు భూసురాకృతిని ♦ చెందుట యెవ్విధి సంభవించు న
ప్రతిహతవాక్యశాలి ముని ♦ వర్యుఁడు దబ్బరలాడు టెట్లగున్.

క॥ వనిత మనోవాక్కాయము
లను కరణములందు ముఖ్య । మగు మనమున స్కం
దుని గోరి మరల వేరొక
జనపతిఁ గోరుదునె నేను । చపలనె చెప్పుమా.

చ॥ అమరనదీతరంగనిచ ♦ యంబుల నాడెడి రాజహంసము
ల్పములగు రొంపిగుంటల మె ♦ లంగఁ దలంచునె సర్వదేవతా
రమణకిరీట కోటిమణి ♦ రాజితపాదుని కార్తికేయు స్వాం
తమున వరించి వేరొకని ♦ నాథునిగా వరియింతునే యికన్.

క॥ స్కందున కాశ్రితలోకా
నందునకున్ భక్తి నిడిన । నాతనుధనముల్
పొందునె వేరొక్కరు నీ
సందియ మేమిటికి నీకు । జలరుహనయనా.

క॥ ఆరుచిరాంగుఁడు నాపైఁ
గూరిమి వాటింపఁడేని ♦ కుసుమశరుఁడు నన్
గూరాస్త్రంబుల నేచఁడె
శారిక లల్లరి యొకింత ♦ సలుపక యున్నే.

వ॥ అని విరహావేదనం బడి పలుకునవ్వారారోహఁ గాంచి వయస్య యిట్లనియె.

ఉ॥ చింతిల నేటికమ్మ సర • సీరుహలోచన పుష్పబాణుఁ డా
వంతయు భీతిఁ జెందక సి । తాంబకముల్ బరగించి నీ మనః
కాంతుని నిన్ను బోటె నోడి • కంబున నేయును దాన శూరప
ద్మాంతకుఁ డేగుదెంచి నిను • నక్కునఁ జేర్చునదృష్టమయ్యెడున్

క॥ నీ మోహనాకృతిన్ గని
హైమవతీ సుతుఁడు శంబ • రారాతిధను
ర్జ్యాముక్త శరహతుండై
కామింపక యున్నె నిన్నుఁ • గంజదళాక్షీ.

క॥ హరునంతవానిపౌరుష
మరచేయఁగ నేర్చినట్టి • యంగభవున కా
శరజన్ముఁడ సాధ్యుఁడగునె
తరుణీ నీకింత వంత తగునే చెపుమా.

ఉ॥ ఆకుహనానృపాలతన • యాగ్రణి నీయెడఁ గల్గు కూర్మిచే
నాకులచిత్తుఁడై యహర । హంబుఁ దపించుచు ముఖ్యకార్యముల్
బోకడ వెట్టి యవ్విపిన • భూమి నినున్ గవఁ గోరి తిమ్మరున్
గాక యచేతనంబువలెఁ • గంపముఁ జెందక నిల్వనేర్చునే.

వ॥ అని పలువిధంబులఁ బలుకుచు నల్లికి శైత్యోపచారంబులఁ గావించుచుండె నక్కడ గిరిజాకుమారుండుద్యానవనముఁ జేరి నిషాదకన్యన్ గానక తనమనంబున.

చ॥ అలికుల నీలవేణి తలి • రాకులజొంపము చెంత నిల్చి కో
మలకరపంకజాతరుచి • మంజులవృంతము సంక్రమించి రం
గుల నెనయింపగాఁ గనక । కోరకముల్ కొనగోళ్ళఁ ద్రుంచె ము
ద్దులు మురిపెంబుఁ గూర్పఁ జెలితో సరసోక్తుల నాడు చియ్యెడన్.

చ॥ కిసలము కోమలంబయిన • కేల్గవ మెల్లన నెత్తి మాలతీ
ప్రసవము లంటఁ బోవు నెడఁ • బయ్యెద యించుక జారి వ్రేలఁగా

వనరుహనేత్ర మేనిజిగి • పెంపెసలారుచుఁ బూవుగుత్తులన్
బసిఁడిమెఱుంగులన్ దనరు • మాడ్కి నొనర్చెను గాదె యువ్వనిన్

తే॥ లంబమానకోమల • రసాలశాఖావి
తానమైన యీ వి • తర్దిఁ జేరి
కలికి చెలినిగూడి • కమ్రవిపంచికా
స్వరముతోడఁ గలిపి • పాడె నపుడు.

క॥ ఈ కపురఁపుటనఁటికడన్
రాకాశశివదన కీర • రాజంబున కా
ర్యాకమనుని గీతికల • ని
రాకుల చిత్తయయి చెప్పె • నప్పుడు వేడ్కన్.

వ॥ అని యనేకవిధంబుల లతాతన్వి యొనరించిన చైవులఁ దలంచి గట్టుమనుమఁడు సిరివట్టిపెట్టు కారియల గుట్టుచెడి మెల్లననడచుచు

క॥ చనునే సహకారాలిం
గనము గలిగినంత మాత్ర • గర్వించెద వో
కనకంబా యొకపలుకే
కనకంబా తరుణి నిందు • గాంచితె చెపుమా.

తే॥ చిగురుఁబోడి నీదు • చెంతఁ జేరుదుగదా
యామ్రిమా వచింపు • మమ్మ సుంత
పగడమా యెఱింగి • పలుకవు దోసమా
విద్రుమోష్ఠిఁ గంటి • వే యిచటను.

తే॥ తమ్మివాసకముం దావి • దిమ్మవడెదు
నట్టులరచెదు గాని యా వంత యేని
మాట వినిపించుకొనవేల • మధుకరంబ
కమల దళనేత్రి నెటనైనఁ • గాంచవు గద.

వ॥ ఇట్లా కుమారరాజనందనుండుద్యానవనంబునం దెల్ల నన్వేషించి నిజవల్లభఁ గానక వ్యాధపురంబుఁ జొచ్చి యందొకదివ్యభవనంబుఁగని

మ॥ అదె కాంబోలు విరోధిభూధవభుజా ♦ హంకారదావానలాం
బుదమా వ్యాధనృపాలుగేహము మహా♦ముల్యేందు కాంతాశ్మ సం
పదనొప్పారుచు నున్న దయ్యదె బహిర్ద్వారంబు యోధాగ్రణుల్
విదురం గూరుచు నున్నవా రచట నెం తే భీతిఁ గల్గించుచున్ •

క॥ ఈ వాకిటన్ జనఁగరా
దా వాకిలి నిష్కుటమున ♦ కంతిక మచ్చో
నే వెరవున నైనను రా
జీవాక్షిని గాంచు తెరువు • సేయఁగ వచ్చున్.

క॥ అని తలఁచుచు నా భవనం
బునకు వెనుక నైపు జేరి • పూఁబోడి నికన్
గనఁ దగు నను ధైర్యంబున
మనమునఁ గల వంత కొంత ♦ మట్టువడంగన్.

ఉ॥ ఏ సడిగల్గినన్ జలరు ♦ హేక్షణకమ్మని పల్కయంచును
ల్లాసముఁ జెందు నెట్టి సర ♦ సంబగువస్తువు గాన వచ్చినన్
భాసుర కోమలాంగయగు ♦ వల్లియె యంచును భ్రాంతిఁజెందుఁ గ్రొం
చాసురగర్వహంత కును ♦ మాస్త్రిని నేర్పతిలోకమాఁ గదా!

వ॥ అని తలంచుచుండ యాదృచ్ఛికంబుగ వయస్య యరుదెంచె నంత

ఉ॥ పెన్నిధిఁ గాంచినట్టి నిరు ♦ పేదవిధంబునఁ గార్తికేయుఁడా
కన్నెలమిన్న నెచ్చెలిని ♦ గన్గొని యెంతయు సంతసంబునన్
గన్నుల భద్రిబాష్పములు ♦ గ్రమ్మఁగ దేహము కంపమొందగా
నన్నళినాక్షితోడ దర ♦ హాసము భాసురమై తలిర్పఁగన్.

చ॥ జలరుహలోచనామణి ని పాదకుమారికి సేమమే ననున్
దలఁచునె యెన్నడైన వని • తా తన వాల్గను గ్రాల్పఁ గట్టి యా
వలచినవాని నిట్లు మరు ♦ బారికి సుశిక్షఁగఁ జేయుటొప్పునే
తలఁపదె ధర్మమూలము గ్రశి ♦ తపరికరావన మంచు నెమ్మదిన్.

క॥ తన సోయగంబునకు నా
జనియెల్లను శుల్కముగ నె ♦ సంగితి నాకున్

మనసీయదయ్యె సుంతయు
వనితా యికనెట్టుల సాయ ♦ పడవలయుం జుమీ.

మ॥ అనిరక్తుండగువానిపైఁ గినియనే ♦ లా మీలతాతన్వి మే
ల్గొనముల్గల్గిన జాణ గాదె చెపుమా ♦ లోలాక్షి నింకెట్లు గాం
తునొ యేరీతిఁగఁ దత్సమాగమము నా ♦ త్తున్ సుంత సాయంబొన
ర్చి నను న్ధన్యనిగాఁగఁ జేయఁగదవే ♦ శ్రేయంబగున్ నీకికన్

వ॥ అని నిజకార్యానుకూలగతిఁ బలుకు నాశౌర్యనిధి పలుకుల కలరి యాకలికి బిత్తరి పలుకుల నిట్లనియె.

క॥ జననాథ నీ వియోగం
బనుసాగరమున మునింగి ♦ యబ్జదళాక్షి
జనమణి యగు మా కన్నియ
తనువు కృశింపంగ నిన్నె ♦ తలఁచుచు నుండున్.

చ॥ సలలిత తేజ యౌవనగ ♦ జమ్ముగ బీచమడంచి ప్రాణముల్
నిలిపినదాత్మవైరిగద ♦ నీయెడ మాచెలికేల కిన్క లోఁ
గలుగును ముద్దరాలగుటఁ ♦ గన్నియ నిన్నువరించియున్ ద్రపా
కలన స్వతంత్రగాదు తనకాంక్షితమున్ వెలిబుచ్చ నింతయున్॥

క॥ సకలకళాకుశలిని మా
పికవాణి భవద్యథార్థ ♦ వృత్తమెఱింగి తా
వకనామంబె స్మరించుచు
నకలంకమతిన్ ద్వితీయ ♦ యగు నీ కింకన్.

చ॥ నృపకులసార్వభౌమ రమ ♦ ణీమణి కహుఁడవీవు మీయెడన్
గుపితుఁడు పుష్పసాయకుఁడు ♦ కొంచెపు సేతలఁ బోవువాఁడుగాఁ
డపరిమితానురాగభరి ♦ తాత్ములరై తమరేకమైనఁ గా
కిపుడ లతాంగిఁ దెత్తుఁ గొని ♦ యొగుము యిష్టము దీర్చుకొమ్మికన్

వ॥ అని పలికి గృహాంతర్భాగంబునకరిగి లవలిన్ గొనివచ్చి దేవసేనాపతిచెంత నిలబెట్టియిట్లనియె.

చ॥ తెలియని ముద్దరాలిది య ♦ దృష్టవశంబున నీకుఁ దక్కె నీ
కలుషవిహీన నేపగిదిఁ ♦ గాతువొ నీయెడ గారవంబునన్

వలచినకన్నెగాని యొడ • యెంటిదిగాదు కులంబు నీతియున్
నిలువఁగఁ గొంచెఁబొమ్ము ధరణీవర శాస్త్రములు చూడకుండఁగన్

క॥ అని యప్పగించిన పడఁ
లనుఁడు ముదంబున నిషాద • నళినాక్షి కరం
బును బట్టి పురము వెలువడి
చనియె మహారణ్యమున ని • శాసనుఁడుమునన్

తే॥ అటులఁ జని యొక్క కానన • మందు విడిసి
మానినీలోకసమ్మాన్య • మైన వల్లిఁ
గాంచి యుల్లనిపల్క నా • క్రౌంచభేది
దరహాసము ముఖంబునఁ దాండవింప.

మ॥ అరవిందానన యెన్నడే నిటుల సిం • హవ్యాఘ్రభల్లూకభీ
కరమా ఘోరవనంబుఁ గాంచితివె రం • గత్తుంగసౌధాగ్రబం
ధురజాంబూనదడోలికావితతియం • దున్ మెల్లనన్ జేర్చి సుం
దరులౌ నెచ్చెలు లూచఁగా నిఁకుల నా • నందించుచో దక్కఁగన్.

తే॥ అడుగు బెట్టనేర • కోమముల నైన
నెటుల నడువనేర్చి • తింతదవ్వు
నెలఁత కాళ్లు పొక్కె • నెత్తురుముద్దలై
జాలిగొలుపు నెంత • శ్రమము వడితో.

తే॥ అలసలలితముగ్ధంబులై • యవయవంబు
లధ్వసంపాతఖేదంబు • నట్టె తెలుపు
మామకోరుదేశంబున • నుగువ సుంత
విశ్రమించి తొలంగింపు • మా శ్రమంబు

వ॥ అని పలికి యయ్యబలాలలామంబును తనయుత్సంగతలంబున శయనింపఁ జేసి తరుకాండంబున శొరఁగి యించుక కనుగూర్కెనంత

తే॥ సుకృత దుష్కృతములఁ • జూచె దైవ్వ(?)ర్పరి
యినుఁడు చక్రవితతి • నేల వచ్చు
మేలుకొండటంచుఁ • గాలపురుషుఁ డెత్తు
టెక్క మనఁగ వేగు • జుక్క వొడిచెఁ.

క॥ సకలంబగువ్యవహారము
లకు మావచనంబె కార ♦ ణంబని ముదముం
బ్రకటించువాఁగ నెల్లెడఁ
జకోరకోకిలయఱచుఁ గోష్ఠు ♦ కూయఁ దొడంగెన్.

వ॥ అత్తఱి వల్లీజనని తనయఁ గానలేక హాహాకారంబులు గావించిన
ధనురాస్యుండెఱింగి క్రోధతామ్రాక్షుండై.

మ॥ అరరే యెవ్వఁడొ సాహసంబు మెయి నల్పాయుష్కుఁడై వాఁడు భీ
కరమద్బాహుపరాక్రమంబెఱిఁగియుం గన్యామణిన్ దుష్టుఁడై
హరియించెన్ భయమింతలేక గుహ నిద్రాసక్తమై యున్నకే
సరిదంతంబు పెకల్ప నెత్తిగలఁడే ♦ సర్వంసహామండలిన్.

చ॥ తమతమయస్త్రశస్త్రములఁ దాల్చి హుటాహుటి నెల్లదిక్కులన్
నెమకుఁడు వాహినీపతు లనేకపదాతులఁ గూడి యంచు వే
గము ప్రకటించిరందు మన ♦ కన్నియఁ గైకొనినట్టి తస్కరా
ధముఁ బరిమార్పకుండిన వ్యథాయగు మాపుక విక్రమంబిలన్

క॥ అని బిగ్గరగ వచించిన
ననుచరులెల్లరును గుపితు ♦ లై విభునాజ్ఞన్
గొని పురమెల్లెడఁ జాటిన
విని సేనాపతులు నెమక ♦ వెడలిరి కడఁకన్.

వ॥ అట్లువెడలి దండనాయకులు నలుదిక్కుల వెదకుచుండిరక్కడ
ధనురాస్యుఁడు నిజోచితపరివారంబు వెంటఁగొని యరిగి యం
దందు వెదకి యొక్క మహారణ్యమధ్యంబున.

చ॥ పతియుత్సంగమునన్ శిరంబు నిడి దీ ♦ వ్యచ్ఛేషదర్వీకర
ప్రతిమానంబగు వేణితో నలరు నా రామామణిన్ దత్కుచ
ద్వితయాంచత్కర పల్లవుండయిన పృథ్వీనాయకున్ గాంచి క్రో
ధతమోఘుండయి వ్యాధమాళి భటసం ♦ తానంబుతో నిల్వనున్

మ॥ తనయాతస్కరుఁ డాతఁడే కనుఁ డకృ ♦ త్యంబుంచుఁ జింతింపకి
ట్లనుగుంబుత్రిక దొంగిలించికొని ఘో ♦ రారణ్యమధ్యంబునన్

దన సేవాఘను గాంచ లేరనుచు ను ♦ న్వాఁడాఖలుఁ బట్టి తెం
డనుకంపన్ విడవాడి కొట్టుఁడు మదీ • యాజ్ఞానుసారంబుగన్

క॥ అని యాజ్ఞాపించిన వ్యా
ధనికరమప్పుడు నిజాయు • ధంబుల సరిజే
సి నభఃపటము బ్రిదులఁ జ
య్యన గర్జారవముపొల్చ • నరచిర కడఁకన్.

అట్లు శబర సైన్యంబు భయంకరంబుగ నరచిన వల్లీదేవి భయంబుగదుర సేనానిఁ బ్రార్థించుటయు భక్తరక్షకుండగు నాతఁడు నిజవాహనంబగు కుక్కుటంబును స్మరించిన నది యరుదెంచి బ్రహ్మాండంబు కలగుండుపడ గూసిన పుళింద సైన్యంబు కర్ణపుటంబులు పగుల నేలకొరగె నంత.

క॥ ఎచ్చటికిఁబోవువాఁడో వి
యచ్చరముని వరుఁడు తార • కారికడకు వే
వచ్చి వినతాంగుఁడై విల
సచ్చతురతఁ బలికె నిట్లు • శరజన్మునితో

అనఘ సమస్త ధర్మముల • కాశ్రయభూతుఁడవీవు నీయెఱుం
గని దొక టెందుఁగల్గునె య • ఖండబలాఢ్యులు వ్యాధయోధులీ
వనితఁగుఱించి నీకు హిత • వర్గమె కాదె వధార్హులౌదురే
కనలకు మింక నామనవిఁ • గైకొని వీరల నుద్ధరింపుమా.

తే॥ అనుచు వేడిన సుమనోమ • హర్షివచన
గౌరవము కల్మి సత్కృపా • కలితుఁ డగుచుఁ
శరవణభవుండు ధనురాస్య • సహితమైన
సైన్యమునకు నొసంగెఁ జైతన్యమపుడు.

అట్లు పుళింద సంతానంబును జీవింపఁజేసి లీలామానుషవిగ్రహుండగు తారకారి నిజరూపంబుఁజూపిన శబరాధిపులందరు మహానందము నొంది రంత ధనురాస్యుండు వినయంబున నంజలి గావించి.

సీ॥ నీకతనఁ బుట్టు • నిఖిలలోకంబులు
జలధిఁ దరంగసం • చయము మాడ్కి
నీ కారణంబున • నెగడుఁ బ్రపంచంబు
సితపక్షచంద్రికా • శ్రీ వహించి
నీలోన లీనమౌ • నీలోకజాలంబు
లగ్ని స్ఫులింగము • లట్ల నపుడు
నిన్నె సేవింతు • రా పన్నరక్షకుఁ డంచు
బ్రహ్మాదినిర్జరుల్ • భటులపోల్కి
నిన్నె వర్ణించుచుండు న • నేకగతుల
శ్రుతులు స్మృతులు బురాణ సం • తతులు సతము
నీ మహాత్వంబుఁ బొగడంగ • నేర్వఁగలమె
యాశ్రితావన దక్ష లో • కైకరక్ష.

శా॥ దేవా నీ మహిమం బగణ్యము భవ • ద్దివ్యప్రభావంబు సం
భావింపన్ దగుఁగాని యిట్టిదని చె ల్వ్వన్ శక్యమే యేరికిన్
భావాతీత సమస్త సద్గుణఖనీ • ప్రజ్ఞానిధీ కార్తికే
యా వందారుజనావనా త్రిజగదీ • శా భక్తచింతామణీ.

క॥ అనఘా రహస్యపద్ధతిఁ
గొనిపోవన్ దగున రాచ • కూఁతును కులమం
దున వెలితికాదె మాకీ
వనితను విధ్యుక్తముగ వి • వాహము గమ్మా.

సీ. పదునాల్గులోకముల్ • పాలింపఁగలవాఁడు
సర్వజ్ఞమూర్తి నీ • జనకుఁ డరయ
సకలలోకంబుల • సాకెడు సర్వమం
గళ నీకుఁ జనవిచ్చు • కన్నతల్లి
వాసవాదులకును • బ్రథమపూజ్యుండయి
యలరారుచుండు నీ • యగ్రజుండు
అఖిలరత్నంబుల • కాశ్రయుండైన భూ
ధరపతి నీకు మా • తామహుండు

సకల దిక్పతుల్ నీకను • చరులు నీవు
దేవసేనావిభుండ విట్టి • పావనుండవు
మాసుతం బరిగ్రహించుట • మాకులంబు
ధన్యముగుగాదె తారక • దైత్యహారణ.

వ॥ అని యనేకవిధంబుల వినుతించినం గుక్కుటధ్వజుండు కృపాయు క్తచిత్తుండై ధనురాస్యునిగాంచి తొల్లి సౌందర్యామృతవల్లులను రాజపుత్రిక లిరువురు నన్ను బరిణయం బాడంగోరి తపం బొనరించిన మెచ్చి వేరొకజన్మంబునం బరిగ్రహింతునని వరం బొసంగితి. అం దమృతవల్లి యనునది యింద్రునకుం బుత్త్రియై నన్ను వరించె. కణ్వశాపంబున నారాయణుండు శివాఖ్యమునియై తపం బొనర్చుచుండ నిందిరాదేవి కురంగిరూపంబున నాతనిం జేరె. వారిరువురకును సౌందర్యవల్లియగు నీమె జన్మించె. విష్ణ్వంశసంభూతుండ వగు నీవీతరుణిం బెంచితివి అక్కారణంబున నేనీవరారోహం జేపట్టితి. నీయిష్టం బట్ల వల్లిని విధ్యుక్తంబుగం బరిణయం బయ్యెద నని వచియించి పుళిందనాథుని గూడి నారదుండు తోడరాం బరిపూర్ణపురంబుం జేరె నప్పుడు నారదముని సేనానిగాంచి యిట్లనియె.

తే॥ జగముతల్లిదండ్రు • లగిజాగిరీశ్వరు
లిందు రామిం బెండ్లి • యెట్లొర్చు
వాండ నని విచార • పడు ధనురాస్యుండు
కనికరింపంగదవె • క్రౌంచదమన.

క. అనిప్రార్థించిన గౌరీ
తనయుండు దరహాస దీపి • తముఖుండగుచున్
జననీజనకులం దక్కిన
యనిమిషవర్యుల దలంచె • నాసమయమునన్.

మ॥ కరుణాసాంద్రవిలోచనంబుల జగ • త్కళ్యాణమూర్తి గూర్చుచు
గరిచర్మాంబరదీప్తితోడ భుజ • గ్రైవేయహారాళితో

సిరులన్ జల్లెడి మోముదారలతో • శ్రీకంఠుండున్ గౌరియున్
శరజన్మున్ గన నేగుదెంచిరి మహో • త్సాహంబు సంధిల్లఁగన్.

తే॥ తమ్ముఁ గుజ్జాపెండ్లి • తడవు సేయక చూచి
వత్తు ననుచు నెలుక • నార్వ నెక్కి
ప్రమథు లనుసరింప • ద్వైమాతురుండు డేగు
దెంచెఁ గొన్ని మణులఁ • గొంచు నపుడు.

మ. దివిషద్రాజకిరీటకోటిమణిరా • గిప్రాంఘ్రియౌ నాథుఁడా
లవలీకన్య బరిగ్రహించు ననుచు • ల్లాసంబునన్ దేవసే
న విలాసంబున నేగుదెంచెను మరు • న్నారీమణుల్ గొల్వఁ ను
త్సవసందర్శనకాంక్ష చేఁ గనకభూ • షల్ గొంచు నచ్చోటికిన్.

వ. మఱియు లక్ష్మీనారాయణులును వాణీహిరణ్యగర్భులును శచీపు రందరులును తక్కంగల దిక్పాలురును నిజోచిత పరివారంబులతో నరుదెంచిన ధనురాస్యుండు వారివారికిఁ దగినవిడుదులఁ గల్పించె నప్పుడు

మ॥ కరపద్మంబుల స్వర్ణకంకణరుచి • త్కారంబు తోరంబుగా
సరసీజానన లొక్కకొందఱు మహో • త్సాహంబుతో నమ్మనీ
శ్వరునాజ్ఞన్ దలయంటిరప్పు సతికిన్ • బ్రాంచన్మణిప్రోతసుం
దరపాత్రస్థసుగంధితైలమున ను • ద్యద్భావోత్కల్ బల్కుచున్

చ॥ స్ఫురదరవిందనేత్రయగు • సుందరి యొక్కతె లీలఁ బచ్చక
ప్పురఁపురజంబుతోఁ గలిసి • పొల్పెసలారు హరిద్రచూర్ణమున్
సరసిరుహాననామణి ని • షాదకుమారిక మేన నల్లుఁ బె
ట్టె రుచిత త్తనుద్యుతుల • కివి కెలంకుల సంక్రమింపఁగన్.

మ॥ తళుకుల్ జెక్కులు చెమ్మగిల్లి నవము • క్తాజాలమున్ బోని చి
న్కులు చన్గొండలమీఁద బ్రాలఁ జివురాకుంబోడి యొక్కర్తు శీ
తలపంకేజమరందమిశ్రితవియ • ద్గంగాజలాపూర్ణని
ర్మలకుంభంబుల నెత్తి స్నానమొనరిం • పన్ జేసె వ్యాధాంగనన్

తే॥ అన్యలావణ్యవిజితమృగాక్షి యొర్తు
జిలుగుపావడము చెఱంగు • చేతఁబూని

పసిడిజిగి బిసాళించెడి ♦ వ్యాధకన్య
మేని తడియొత్తెనప్పుడు ♦ మృగులరీతి॥

వ॥ అంత నావల్లీదేవి యుత్సాహంబు పెంపున

సీ॥ తళతళలాడు క్రొ ♦ త్తరకంపుజిలుగుదు
వ్వలువనితంబమం ♦ దలవరించి
నిగనిగలాడు పె ♦ న్నెఱులం జిక్కడలించి
చక్కనిజాజిపూ ♦ సరముం జుట్టి
గమగమవలచు చొక్కపుజవాజి పొసంగు
మలయజగంధంబు ♦ మైం నలంది
చకచకద్యుతి నర్ధ ♦ చంద్రుతేట హసించు
మోమునం బెండిలి ♦ బొట్టు బెట్టి
తరుణకిసలయమృదులహ ♦ స్తద్వయోష్ఠ
దేశములం బారిహార్యముల్ ♦ దీటుకొలిపి
లలితపదముల నూపురం ♦ బులు ధరించి
పరిణయోచితాలంకార ♦ భరితయయ్యె

వ॥ అంతసుముహూర్తంబు చేరువగుటం జేసి.

తే॥ అమరమౌని పురోధయై ♦ యహీనరీతి
నగ్నికార్యంబుం జేయింప ♦ వ్యాధనృపతి
పితృపితామహాదులకు స ♦ ద్గతులు గలుగ
సకలంగానకుం దనసూతు నొసంగెనపుడు.

క॥ కనకాభరణంబులు ర
త్న నికరము దుకూలములును ♦ ధనురాన్యుం డొసం
గెను రాజమౌళితనయున
కనఘుచరిత్రునకుం బరిణ ♦ యావసరమునన్॥

చ॥ అనుపులు సూనముల్ గురిసి ♦ రచ్చరలాడిరి తుంబురాదిగా
నసము దెసలన్ జెలంగెం బవ ♦ నంబులు చల్లంగవీచె భూమిభా
రము తలంగెన్ బుధావళికి ♦ రంబు కుతూహలమొందె నావివా
హాహు జగదుత్తరంబగుచు ♦ వ్యాధనృపాలకునింట నానెడన్

వ॥ అప్పుడు వల్లీజనని కూఁతునక్కునఁ జేర్చుకొని మెల్లన నిట్లనియె॥

సీ॥ మగనిపౌరుషము సాముగఁ జేసె నీయత్త
యామె నెట్లలరింతు వమ్మ నీవు
విషమెత్రింగినవాఁడు వెలఁది నీమామ యా
తఁడు మెచ్చ నేరీతి నడతువమ్మ
మారుమోముగలాఁడు మగువ నీబావ యా
తని చిత్త మెవ్విధిఁ గనెదవమ్మ
తమ్ములపగవాని తనయ నీయేరాలు
కలహనిరత నెట్లు గెలుతువమ్మ
త్రిభువనపరీతవిమలకీ ర్తినిధి యైన
శబరపతికెవ్విధిఁ బ్రతిష్ట సలుపుదమ్మ
ముద్దరాలవు మాయింట వోలె నచట
సంచరింపకుమమ్మ య శంబుగనుమ.

వ॥ అని బుద్ధులుగఱపె నప్పుడు ధనురాస్యుండు పార్వతీపరమేశ్వరుల కును దక్కంగలవేల్పులకును బంధువులకును ననేకోపాయనంబు లనొసంగె నంతవివాహాడంబరుదెంచినయెల్లవారును నిజాలయంబు లకరిగిరి శరజన్ముండు వల్లీదేవసేనాసహితుండై కొండొకకాలం బందువసించి పిమ్మట ధనురాస్యునివీడ్కొని నిజనివాసంబగు పరి పూర్ణాద్రిఁ జేరెనని తెల్పిన శౌనకాదులు సంతోషంబున నాలించి తత్కాలోచితకృత్యంబుల నిర్వర్తింసాగిరి.

తే॥ కలుషహరము వల్లి కళ్యాణచరితంబు
విసువ కెవఁడయేని వీనులలర
నాలకించు వాని కాయురారోగ్యధ
నాభివృద్ధి యగుఁ బురారికరుణ

ఆశ్వాసాంతము.

క॥ గౌతమసగోత్ర సుగుణ
వ్రాత నిరుపమానవైభ వా కీర్తినిధీ

పూతచరిత సకలోర్వీ
ఖ్యాతా ద్విజకులశశాంక • కవికులమిత్రా.

సీ॥ ఏమహామహుఁడు శ్రీ • వేమనారాధ్యవం
శాంబ్ధికిఁ బూర్ణశ • శాంకుఁ డయ్యె
నేతల్లి సావిత్రి • కెనయై బుధుల్ మెచ్చ
మహిని బాతివ్రత్య • మహిమ గాంచె
నట్టి నందయకు గౌ • రమకు ద్వితీయపు
త్రుండఁ గౌండిన్యగో • త్రుండ దక్షి
ణామూర్తికిని శివా • నందునకును సోద
రుండఁ గూరిమి యగ్ర • జుండ సుబ్బ
నార్యునకుఁ బౌత్రుఁడను మదీ • యమయియెలరు
నట్టి వల్లీపరిణయకా • వ్యంబునందు
నమలమగు పంచమాశ్వాస • మయ్యె దీని
సతము రక్షించుఁగావుతఁ • జంద్రమౌళి.

మంగళం మహత్.

శ్రీ శ్రీ శ్రీ



26807
25.3.73